# ఆంధ్రమహిళ

ఏకైక మహిళాభ్యుదయ మాస పత్రిక

October
1962
అక్టోబరు

★

# 'Andhra Mahila'





**Vol. XVIII**
**No. 10**

★

**37 nP.**



# ఆంధ్ర మహిళ

ఏకైక మహిళాభ్యుదయ

మాస పత్రిక

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్
వ్యవస్థాపకురాలు



## విషయ సూచిక




వ్యవస్థాపకురాలు : దుర్గాబాయి దేశ్‌ముఖ్

సంపుటి 18 :: అక్టోబరు 1962 :: సంచిక 10

# మేయర్ కుముదినీదేవి

ఆంధ్ర రాజధాని హైదరాబాదుకి ఒక ఆంధ్ర మహిళ మేయర్‌గా ఎన్నికవడం ఆంధ్రులందరూ ఘనంగా భావించదగిన విషయం. ఇరుగు పొరుగు రాష్ట్రాలలోని ప్రధాన నగరాలకు స్త్రీలు యింతకుపూర్వమే మేయర్లు అయారు. ఆ గౌరవము ఈనాడు మనరాష్ట్రానికి కూడా లభించింది. ఇన్నాళ్లకు తొలిసారిగా ఒకమహిళ మేయర్‌గా ఆంధ్రరాజధానీ నగరానికి ఎన్నిక అయింది. ఇది ఆంధ్రుల అభ్యుదయ దృక్పథానికి ఒక నిదర్శనం.

శ్రీమతి కుముదినీదేవి పేరు కోస్తాజిల్లాలవారికీ, రాయలసీమవారికీ అంతపరిచితం గాక పోవచ్చు, కాని జంటనగరాలలోని ప్రజలకూ, తెలంగాణా వారికీ ఆమెసంఘసేవానిరతి పాఠి కేళ్ళగా తెలుసు. రెడ్‌క్రాస్, హాస్పటల్ సంక్షేమ సంఘం, రిజీనియల్ హాండీక్రాఫ్ట్ సంస్థ, కుకట్ పల్లి కుష్టురోగుల కాలనీ మొదలగు వాటి ద్వారా రాణీ కుముదినీదేవి అపారమగు సంఘసేవ చేశారు.

ఈనాడు ఈమె మేయర్‌గా ఎన్నికవడం ఆంధ్రమహిళలకు ఆనందహేతువు. లక్ష్మీ సరస్వతులకు నిలయమైన కుటుంబములో 1911 లో జన్మించారీమె. ఇప్పటికి రెండుసార్లు హైద్రాబాద్ కార్పొరేషన్ కౌన్సిలర్‌గా ఎన్నికఅయి, పట్టణపారిశుధ్యానికి యితోధికంగా పాటుబడ్డారు. మొన్నటి జనరల్ ఎన్నికలలో వనపర్తి నియోజక వర్గంనుంచి రాష్ట్రశాసన సభకి ఎన్నుకోబడ్డారు. సాంఘిక సంక్షేమ కార్యకలాపాలలో, కార్పొరేషన్ వ్యవహారాలలో, రాష్ట్ర రాజకీయాలలో హైద్రాబాద్ సాంస్కృతిక విషయాలలో అనుభవం గల కుముదినీదేవి మేయర్‌గా ఎన్నికవడ సమంజసము. ఆమె పదవీ కాలంలో హైద్రాబాద్ నగరం అన్నివిధాలా అభివృద్ధి చెందగలదు.

పంచాయితీ పాలనా వ్యవహారాలు స్త్రీలు పురుషులకంటె సక్రమరీతినీ, త్వరితగతినీ నిర్వహిస్తున్నారనీ యిటీవల చాలా చోట్లనుంచి వింటున్నాము. అది అందరూ ఒప్పుకుంటున్నారు. స్థానిక వ్యవహారాలు స్త్రీల చేతుల్లో వుండటంవల్ల గ్రామాలూ, పట్నాలూ, ఇప్పుడున్న వాటికంటె పరిశుభ్రంగా వుండగలవనడం నిస్సందేహం. స్త్రీ స్వభావరీత్యా తన యింటినీ, చుట్టూ పరి



పత్రాలనీ శుచిగా, శుభ్రంగా, ఒక క్రమతతో వుంచాలని కోరుకుంటుంది. ఆ క్రమత ఆమెకి జన్మతః వస్తుంది. ఈ క్రమత యింటి విషయంలోనేగాక పట్టణ పారిశుద్ధ్యం విషయంలో కూడా వర్తించేందుకు చాలా అవకాశమున్నది.

స్త్రీ మేయర్ అయింది గనక స్త్రీలకేదో ప్రత్యేకమైన సేవచేస్తారనే, చేయాలనే సంకుచిత దృక్పథం వుండకూడదు. పురుషుడయినా, స్త్రీ అయినా మేయర్ అనగానే పట్టణ పారిశుద్ధ్యం, పౌరుల కనీసపు అవసరాలు, బిచ్చగాళ్లకు నిరాశ్రయులకూ తలదాచుకునే వసతిగృహాలూ, బాలబాలికల ప్రాథమిక విద్య, ప్రజల ఆరోగ్య సౌకర్యాలు ఇటువంటివి ముఖ్యం. వీటివిషయం శ్రద్ధ వహిస్తూ, ప్రజాజీవనాభి వృద్ధికై ఉచితరీతిని పాటుబడాలి. శ్రీమతి కుముదినీదేవి తమ బాధ్యతలని ఆదర్శప్రాయంగా నిర్వహించగలరని ఆశిస్తున్నాము. ముందుముందు ఈపదవిని అలంకరించబోయేవారికి ఈమె త్రొక్కినబాట వరవడి కాగలదు.

మాలతీ చందూర్

గౌరవ సంపాదకులు

---

* * *

దేహానికీ, మనసుకీ సన్నిహిత సంబంధంవుంది. ఇందులో ఏది చెడిపోయినా మొత్తం రెండూ దెబ్బతింటాయి. అందువలన విశుద్ధమైన శీలం పూర్ణారోగ్యానికి పునాది రాయివంటిది. జుగుప్సాకరమైన తలపులూ, వుద్రేకాలూ యివి కూడా వేర్వేరు వ్యాధిరూపములే.

సామాన్య ప్రజలే స్వరాజ్యము పొందవలెను. అది ధనికుల ప్రమేయమూ గాదు, విద్యావంతుల ప్రమేయమూ కాదు.

ఆధ్యాత్మిక సిద్ధి వేరు; ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞానం వేరు. ఆధ్యాత్మిక సిద్ధి హృదయ సంస్కారానికీ, తత్వసంపదకీ సంబంధించినది. నిర్భయత ఆధ్యాత్మిక సాధనలో తొలిమెట్టు. భీరువులు ఆధ్యాత్మిక సాధకులు కానేరరు.

—గాంధీజీ

# బాపూజీ అమరవాక్కులు

హిందూమతం సత్యస్వరూపాన్ని వెతికేమతం. సత్యమే భగవంతుడు. భగవంతుడు లేడనటం మాకు జ్ఞాపకం వుందిగాని, సత్యం లేదనడం మాకు తెలియదు.

విచక్షణా రహితంగా ప్రభుత్వాన్ని ప్రతిఘటించ బూనడం విశృంఖల ప్రవృత్తికీ, అశాంతికీ, తద్వారా ఆత్మ వినాశనానికీ దారి తీస్తుంది.

కార్య సాధనకుగాను నా జీవితంలో నేను దేనికీ ఒడిగట్టలేదు. ఉత్తమ నీతియే ఉత్తమ సాధన అనుకున్నాను.

అంతరాత్మకు అసత్యంగా వుండే బదులు, లోకానికి అసత్యంగా వున్నట్లు కనబడటం లక్షరెట్లు వుత్తమం.

మృత్యువును తలగడగా జేసికొనే జాతిగొప్పది. మృత్యువును ధిక్కరించు వారికి ఏ భయమూలేదు.

సత్యము స్వతః ప్రత్యక్షము. దాని నావరించిన అజ్ఞాన ఆచ్ఛాదనలను తొలగించగానే అది స్వచ్ఛముగా ప్రకాశించును.

శస్త్రయుద్ధ మొనరించి జగత్తును జయించుట కంటే, మనోవికారములను జయించుట నాకు మిక్కిలి కష్టమనుపించుచున్నది.

అభిప్రాయ భేదములు ద్వేషభావములకు దారి తీయగూడదు. అట్లుగనక అయివుంటే నేనూ నా భార్య గర్భశత్రువులమయి వుండేవారం.

నా లోపాలు నాకు తెలుసు. ఆ తెలియడమే నాకున్న బలం. జీవితంలో నేనింతవరకూ ఏమి సాధించివున్నా అదంతా ముఖ్యంగా నా లోపాలని నేను తెలుసుకో గలిగినందువల్లనే సాధించగలిగాను.

స్వరాజ్యం ఒకజాతి యిస్తే మరొక జాతి పుచ్చుకునే దానంకాదు. ఉత్తమ రుధిరంతో గైకొనవలసిన 'నిధి' అది.

నేను పండితుడనుగాను. కాని ప్రార్ధన చేయువాడనని వినయముగా తెలుపుకొను చున్నాను. ప్రార్థనా, విద్యా విషయములో ఎవరికి వారే నిర్ణేతలు. అయిననూ కొన్ని నలిగిన బాటలున్నవి. ప్రాచీన బోధకులు నడిచిన బాటలో అడుగిడిపోవుట సుగమము.

సందర్భ శుద్ధిగా కన్పించవలెననే యావ నాకులేదు. సత్యాన్వేషణలో అనేక భావాలు పరిత్యజించాను. కొత్తవి అనేకం గ్రహించాను. వయసులో వృద్ధుడనైనా అంతరంగవికాసం ఆగి పోయినట్లు నేను అనుకోను. వార్ధకంతో వికాసం స్తంభిస్తుందనీ అనుకోను. నాకు కావలసిందల్లా నా భగవంతుడగు సత్యస్వరూపుని పిలుపును క్షణక్షణమూ విని, నడుచుకోవటమే అదేనాకు అనవరతం కావలసింది.

# మనవి

ఆంధ్రమహిళా సభ స్త్రీజనాభ్యుదయానికి పాతికేళ్లుగా ఇతోధిక సేవచేస్తున్నది. ఈ సేవలో ఇంతవరకూ కనీస అవసరాలనే దృష్టిలో వుంచుకొన్నది. వ్యక్తికనీస అవసరాలస్థాయి దాటాక వున్నతమైనవాటి కొరకు పాకులాడుతాడు. స్త్రీలలో లలితకళాభివృద్ధికై దోహదం చేయాలనే కోర్కె మాకు చాలారోజులుగావున్నది. ఆ చిరకాల వాంఛితంలో తొలిఘట్టం మొన్న జరిగిన సిల్వర్ జుబ్లీలో ప్రదర్శించిన మహిళల చిత్రలేఖనా, పుస్తకప్రదర్శనలు. పుస్తక ప్రదర్శనతో పాటు రచయిత్రుల సమావేశం కూడా జరిగింది.

ఆ ప్రదర్శన సందర్భాన మాసభలో చాలామందికి చక్కని అభిప్రాయం గలిగింది. ఆంధ్ర దేశంలో యీనాడు అనేకమంది రచయిత్రులున్నారు. వీరిలో కావ్యాలు, నవలలు, కథలు, వ్యాసాలు– ఇలా సాహిత్యంలో వివిధశాఖల్లో కృషిచేసిన సోదరీమణులనేకు లున్నారు. వీరిలో కొందరు అత్యధిక సంఖ్యలో గ్రంథరచనలు చేసి ప్రచురిస్తే మరికొందరు ఒకటిరెండు గ్రంథాలు మటుకే ప్రచురించగలిగారు. అసంఖ్యాకమైన కథలు పత్రికల్లో ప్రచురించికూడా ఒక్కసంపుటాన్ని కూడా ప్రచురించక నిర్లక్ష్యంగా వదిలినవారు వున్నారు.

మాకు ఈ అసంఖ్యాక రచయిత్రుల కృతులు, సంఖ్యాజీవిత చరిత్రలూ, చిత్రపటాలతో సహా ఒక గ్రంథం వెలువరించాలని వున్నది. లోగడ సాహిత్య ఎకాడమీ ఆధ్వర్యాన రచయితల యాంథాలజీ ఆంగ్లంలో ప్రచురితమైంది. సుమారుతొమ్మిదేళ్ళ క్రితం శ్రీమతి వూటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు ఆంధ్ర కవయిత్రులు అను పేరున ప్రాచీనాంధ్ర కవిత్వమునుంచి, నవ్యాంధ్రయుగము దాకా సుమారు రెండువందలమంది పద్యగద్య రచయిత్రులను పరిచయం చేస్తూ చక్కని గ్రంథం రచించారు. మద్రాసు ప్రభుత్వ పక్షమున తెలుగు భాషాసమితి బహుమతి కూడా లభించినది ఈ గ్రంథానికి.

పదిసంవత్సరాల క్రితం ప్రకటింపబడిన ఈ గ్రంథం తరువాత ఇటీవల పత్రికా పఠితల సంఖ్య విపరీతంగా పెరగడంతో, రచయితల సంఖ్యకూడా చాలా పెరిగింది. ఈ పదేళ్ళలో రచయితలకంటె రచయిత్రులే ఎక్కువ సంఖ్యలో వున్నారన్నా అతిశయోక్తి కానేరదు. ఈ మధ్య బహుళ జనాదరణ పొందుతున్న రచయిత్రులు అధికసంఖ్యలో కానవస్తున్నారు. ఈ విషయాలన్నీ మనసులో పెట్టుకొని ఆంధ్రమహిళా సభ "రచయిత్రుల యాంథాలజి" ప్రకటించాలని ప్రయత్నిస్తోంది. ఆప్రయత్నానికి తొలిసోపానంగా, నెలనెలా ఆంధ్రమహిళ పత్రికలో ఆ యా రచయిత్రుల గురించిన వివరాలు, వారి రచనల వివరాలూ, సంగ్రహ జీవితచరిత్రా, వారి గ్రంథాల సంఖ్యా, వారి వయస్సూ, ఛాయాచిత్రమూ మొదలగునవి మొదట్లో మా పత్రికలో ప్రచురించి, ముందు ముందు గ్రంథరూపాన తేవడానికి తగుసన్నాహాలు చేస్తాము. ఈ ప్రయత్నంలో మాకు సోదరీమణులైన రచయిత్రుల సహకారము ఎంతైనా అవసరం. ఈవిషయాన్ని గమనించి సోదరీమణులు మేము అడిగిన వివరాలనిపంపి మా ప్రయత్నవిజయానికి తోడ్పడుతారని ఆశిస్తున్నాము,

ఈ వివరాలు 'ఆంధ్రమహిళ'

7. ఎ, రోజరీ చర్చిరోడ్, శాంథోమ్, మద్రాసు–4.

అడ్రసుకు పంపప్రార్థన.

# చౌరస్తా

శ్రీమతి నాయని కృష్ణకుమారి యం. ఎ.

నాలుగు బాటలు కలిసే నట్టనడుమ
నిట్ట నిటారుగా నిలబడిన ఊడల మఱ్ఱి
కింద నిల్చునే ప్రతిమనిషి నెత్తి పైనా
అందమైన అతిచిక్కని ఆకులగొడుగు

ఆమఱ్ఱి పాదాలనుండి బయలుదేరి
ఆశకొద్దీ త్వరత్వరగా ఆశాంతాలు చేరుకున్నా
మళ్ళీ దిక్కుల మొదళ్ళనుండి ఆతురతగా
మఱ్ఱిచెట్టు అక్కునచేరే ఆ నాలుగు దారులూ

ఏకత్వంలో విభిన్నతనూ
విభిన్నతల ఏకత్వాన్నీ
లోకానికి చాటి చాటి
చిత్రంగా చెప్తున్నయ్

కొమ్మల చేతులు చాచిఉంచి
వెలుగు నీడల వింజామరలు వేస్తూ
ఆకుల కళ్ళల్లో ఈనెలు కూర్చుకున్న
ఆచెట్టు ఆదర్శ గృహస్థు—

ఆచెట్టు మొదట చేరగిలబడి
ఆకుల కళ్ళల్లో కళ్ళు కలుపుతూ
అంతులేని ఆలోచనల్ని
వింతల్లా తీర్చిదిద్దుతూ

అన్యమనస్కంగా ఉండిపోయాడు
ఆదర్శజీవి వెంకటరమణ
తనుతానే లోకంగా నిలిచిన ఆమఱ్ఱిచెట్టు
తనలాగే తలచుట్టూ దిగుళ్ళు విరబోసుకొంది

తనకూతురు శరత్కాళ ఎలా ఉందో!
కారుమబ్బుల గగనంలాంటి
తన మనస్సులో వెన్నెల వెలుగులు
వెదజల్లిన శరత్కాళ!

భోజనంకోసం ఆత్మారాముడు ఆరాటపడే ఈవేళ
లాలనగా భర్తపక్కన విసనకర్రతోసహా కూచుని
కొసరి కొసరి తన పసి చేతుల్తో వండిన
అన్నంతినిపిస్తూంటుంది.

నీరచేతులలో వెన్నముద్దలా
అల్లారుముద్దుగా పద్దెనిమిదేళ్ళు
అనదగ్గర పెరిగి
తకు నేనున్నాననే మనసూ
నువ్వే నాధనమ్మనే తృప్తీ
వెలిగే ఓ మనిషిని కట్టుకుని
కళ్ళనిండా నీళ్ళు పెట్టుకుని
తననిక్కడే దిగవిడిచి
తనదోవన తాను వెళ్ళిపోయింది.

పద్దెనిమిదేళ్ల వెనక్కు వెళ్ళి
ఒద్దనుకున్నా అతని మెదడు
గతకాలపు స్మృతులవెంట
ఒకరాత్రి పదిగంటల దగ్గరఆగింది

మనిషీ మనిషీ మంచితనం మర్చిపోయి
మతం పేరొక్కటే జ్ఞాపకం పెట్టుకుని
ప్రాణాలతో చెర్లాడే రోజుల్లో

గోటితో గీరితే వేలికి చుట్టుకునే
చీకటి చిక్కగా పేరుకొన్న రాత్రిఅది!
ఆరోజుల్లో ఎక్కడైనా కాలికింద
రక్తపుబురద మెత్తగా జారేది
అక్కడక్కడా దొర్లే తలలు వికటాట్టహాస
స్ఫురదధరోష్ఠాలను కదిపేవి
మనిషిముఖంలో మందహాసం బదులు
పైశాచ విలాసమూ
మంచితనం బదులు అట్టకట్టిన
ద్వేష స్వరూపమూ
చురుకుగా బరువుగా ఎక్కడచూచినా
స్ఫురించేవి

అంతరాత్రివేళ పెరటిలో అలికిడివినిపిస్తే
భయం మనస్సులో తొంగిచూచి కదలొద్దని
జడిపించినా చీమకన్నా మెల్లగా నడచి
చడీ చప్పుడూ చేయకుండా

ఒళ్ళంతా కళ్ళు చేసుకుని
పెరడంతా పరికించాడు తను!
నూతిగట్టుకు దగ్గరగా చీకటిరూపం తాల్చినట్లు
చేతుల్లో బరువుతో, చెదిరేగుండెల్ని
చిక్కబట్టుకుంటున్న రెండు ఆకారాలు!
అక్కడికి పాతికమైళ్ళదూరాన హాయిగా బ్రతికే తన
అతిప్రియ మిత్రుడు అబ్దుల్‌సాబే అతగాడు!
భాయీ అంటూ అబ్దుల్ తన బాహు మధ్యంలో

ఇరికిపోయాడు
భార్య శిశిర వాతాహత శుష్కపత్రంలా
రెపరెపలాడింది

తానెంత చెప్పినా వినక
తనకూతురి క్షేమంకోసం
కళ్లు తెరవని పసికందును
కాచిపెంచే మాట పుచ్చుకుని

అపాయాలులేని చోటును
చేరగలమనే ఆశతో
అనంత గాఢసంతమసంలో
అప్పుడే కరిగిపోయారు ఇద్దరూ

ఆనాటి సయిూదాయే తనకూతురు శరత్కాళ
తన మనస్సులో వెన్నెల వెలుగులు విరజిమ్మి
తన కన్నుల కలువల జంటను విరియించిన

చంద్రకళ:—

ప్రతిరోజూ ఊడల మర్రి పాదాలదగ్గర కూర్చుని
అతిశ్రద్ధగా నాలుగు దార్లనూ గమనిస్తూంటాడు తను:
మనిషినీ మనిషినీ కలిపే మంచితనం మర్రిచెట్టు
మంచితనం అంచు చివర అంతులేని తన ప్రతీక్ష!

(ఆకాశవాణి సౌజన్యంతో)



# సాహిత్యమూ సాంస్కృతిక విలువలు

శ్రీమతి ఇ. సరస్వతీదేవి

ఆంధ్రమహిళా సభ రజతోత్సవ సందర్భాన రచయిత్రుల సమ్మేళనం జరిగినది. రెండురోజులపాటు జరిగిన ఈ సమావేశంలో సుమారు యిరవై మందిదాకా సోదరీమణులు పాల్గొన్నారు. తొలిరోజున ఆ సమ్మేళన సందర్భంలో "సాహిత్యమూ సాంస్కృతిక విలువలూ" అన్న శీర్షికకింద చదివిన వ్యాసాలు సంగ్రహంగా "ఆంధ్ర మహిళ"లో ప్రచురిస్తూ వచ్చాము. ఈ రెండు వ్యాసాలతో ఆ శీర్షిక ముగిసింది. రెండవరోజున చదివిన "సాహిత్యమూ—సాంస్కృతిక ప్రమాణాలూ" వ్యాసాలని పై నెలనుంచి క్రమంగా ప్రచురిస్తాము.

లిటరేచర్ అండ్ కల్చరల్ స్టాండర్డ్స్—అన్న ఈసింపోజియమ్ శీర్షికకు తెలుగుభాషలో నేను తీసుకున్న అర్థము సాహిత్యమూ సాంస్కృతమయినవిలువలూ అని.

దీనిలో సాహిత్యము మాట అలాఉంచి సాంస్కృతమైన విలువలను గురించి ఆలోచిస్తే సాహిత్యరూపము దానంతట అదే వ్యక్తమవుతుంది. సంస్కృతి అంటే ఏమిటో నిర్వచించుకుంటే విలువలసంగతి సులభంగా బోధపడుతుంది. కల్టివేషన్ అంటే శ్రమతో ప్రయత్నపూర్వకముగా శ్రద్ధతో పెంచి అభివృద్ధి చేయుటము అని నిఘంటువు మనకుచెప్పిన అర్థము. కల్టివేషన్‌కు భూమి సాగుబడి చేయటానికి, నేలమీద ఉన్న చెట్టు చేమా కొట్టివేసి ఎరువులు బాగా వేసి కలియదున్ని, చెత్తా రాళ్లు తీసివేసి విత్తనాలు చల్లి నీరు పట్టుతాడు రైతు. మొక్కలు మొలిచిన తరువాత నారుతోపాటు లేచే కలుపు మొక్కలను తీసివేసి నీళ్ళుపట్టుతూ వాటినిజాగ్రత్తగా పెంచుతాడు. ఈ మొక్కలు పెరిగి పెద్దవయేవరకూ తగిన జాగ్రత్త తీసుకుని శ్రమించి నట్లయితే అవి పుష్పించి ఫలిస్తాయి. ఈ అగ్రికల్చరు, హార్టికల్చరు మాదిరిగానే కల్చరుకు కూడా ఈ విధమయిన అర్థమే వున్నది. విద్యచేత క్రమశిక్షణచేత మేధస్సును సుకుమారమైనదానిగా చేసుకుని మంచి అభిరుచులనూ మంచి అలవాట్లనూ బుద్ధికుశలతనూ పెంపొందించు కోవటము అనే అర్థాన్ని కల్చరు అనే పదానికి విజ్ఞులు చెప్పారు. ఈ కల్చరు అన్న పదానికి మనము సంస్కృతి అంటున్నాము.

విజ్ఞులు సిద్ధాన్తీకరించిన ఈ సంస్కృతి వ్యక్తుల యొక్క విద్యాధిక్యతమీదగానీ, ధనార్జనమీదగానీ, వేషభాషలమీదగానీ, నవీననాగరికత మీదగానీ ఆధారపడలేదు. ప్రతివ్యక్తీ విద్యాధిక్యతచేత — ఉన్నతోద్యోగము సంపాదించి తద్వారా ధనార్జనచేసి నేటి నాగరికతా ప్రపంచములో శబాష్ అనిపించుకున్నంత మాత్రము చేత సంస్కృతి కలవారని అనగలమా? అనలేము! కూటికొరకు కోటివిద్యలన్న సామెత లౌకికంగాఉన్నది. కాని అసలైన విద్యయొక్క పరమార్థము కేవలము ద్రవ్యార్జనకాదు. మానవుడికి ద్రవ్యము ఉదరపోషణార్థము ఉపకరిస్తుందికాని సమగ్రమయిన జీవితాన్ని సమకూర్చలేదు. అతడికి జీవితము వేరేఉన్నది. అలవాట్లూ అభిరుచులూ జీవితవిదానమూ మొదలైనవి సాహిత్యము చేతసంస్కరింపబడాలి. విద్యా విజ్ఞానము దానిలో ప్రతిబింబించాలి. అప్పుడుగాని ఈ జీవితవిధానము సంస్కరింపబడినది కాదు. సంస్కృతినీ వ్యక్తము చేసేదికాదు.

ప్రతి వ్యక్తిలోనూ స్త్రీ పురుషభేదము లేకుండా, కొన్ని శక్తులు గుప్తంగా వుంటాయి. అభిరుచులు కూడా అంతర్గతంగా ఉంటాయి. ఈ అంతర్గతంగా ఉన్న శక్తులు సాహిత్య పరిచయంతో పైకి ఉబుకుతాయి. అప్పుడు మానవుడి హృదయము కళామయమవుతుంది. కళల నారాధించి మానవుడు హృదయానందము కలిగించుకుంటాడు. ఆ కళ ఉత్తమ శ్రేణికి చెందినట్లయితే జగత్కళ్యాణము చేకూరుతుంది.

విద్యనూ, ధనాన్నీ, కళలనూ, సాధించినంత మాత్రం సంస్కృతి పరిపూర్ణంకాదు. సమాజంలో మన సభ్యత్వముకూడ సంస్కృతిలో ఒక భాగమన్నమాట వ్యక్తి సంఘజీవి. సంఘములో వ్యక్తి చక్కగా మెలగి మంచి పేరు తెచ్చుకోవాలి. సహజమైన, స్వచ్ఛమైన సౌజన్యాన్ని పెంపొందించుకోవాలి.

మైత్రీకరుణా ముదితో పేక్షాణాం<br>
సుఖదుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం<br>
వనాత శ్చిత ప్రసాదనం

అని పతంజలి యోగదర్శనము చెప్పుతున్నది మానవుడు సమాజములో అనేకరకాల వ్యక్తులమధ్య మెలగవలసినవాడు. తన పరిస్థితులు ఎట్లావున్నా సుఖభోగపరుల విషయములో మైత్రినీ, దుఃఖితుల విషయములో కరుణనూ, పుణ్యాత్ముల విషయములో మోదాన్ని, పాపాత్ముల విషయములో ఉపేక్షనూ ఏది ప్రసాదిస్తుందో అదే సంస్కృతి. సాధారణముగా మానవుడు తనకు లేనివాటిని ఎదటివాడిలో చూడలేడు. కనుకనే సుఖభోగపరులను చూడగానే సామాన్యుడికి ఈర్ష్యకలుగుతుంది. వారిపట్ల ద్వేషము కలుగుతుంది. అట్లాకాక వారిపట్ల సహనభావము వహించి మైత్రితో మెలగాలి, ఎవరయినా కష్టాలలో ఉంటే, దుఃఖములో మునిగి ఉంటే హేళనగా చులకనగా ఉంటుంది. పాపము చేసినవారిని చూస్తే అసహ్యమూ కోపమూ కలుగుతాయి. వారికి వెంటనే శిక్షపడలేదనీ తగిన ప్రాయశ్చిత్తము కలుగలేదని మనసు ఆవేదనపడుతుంది. అట్లాకాక సానుభూతి కలగాలి. వారుచేసిన పాపములమీద ఉపేక్షాభావము కలగాలి. ఇటువంటి మంచి భావాలు మానవుడిలో కలగటము ఎమోషనల్ హెల్త్ దృష్ట్యా ఆరోగ్య లక్షణమన్నమాట. ఈ ఎమోషనల్ హెల్త్‌ను మానవుడిలో కలిగితే సంస్కృతికలవాడనిఅంటాము. దీనికి తగిన శిక్షణనిచ్చి పెంపొందించటములోనే సంస్కృతి వ్యక్తమవుతుంది.

సాహిత్యము ఏ ఒక్కరిసొత్తూకాదు. అది ఏ ఒక్కరిని దృష్టియందుంచుకొని వ్రాసేదికాదు. దానికి సాంఘిక ప్రయోజనముకూడాడఉన్నది. సకల జనులకూ ఆమోదకరమై సకల జనులకూ అభ్యుదయాన్ని కలిగించేదిగా సాహిత్యము ఉండాలి. సకలజనులకూ ఉపయోగకరమైనదిగా ఉండాలి. దేశకాల పాత్రల కనుగుణ్యముగా ఉండాలి,

మానవుడిలో సుహృద్భావమూ, వాత్సల్యమూ, సానుభూతీ మొదలయిన లక్షణాలు పెంపొందించితే వృద్ధి అవుతాయి. మనసు ఒక ప్రత్యేకస్థాయినందుకున్నప్పుడే అది సాధ్యమవుతుంది ఆస్థాయిని తెలుసుకుని దానిని నిలుపుకుని పోషించుకోవటములోనే విద్య విజ్ఞానమూ-సంస్కారమూ, సంస్కృతీ తోడ్పడతాయి. సాహిత్యమువల్ల మానవ హృదయాలలో ఉన్న మాలిన్యము క్షాళితమయి పోవాలి. కాఠిన్యము కరిగిపోవాలి.

మనసును కదిలించేదీ కదిలేదీ అభ్యుదయ సాహిత్యమే కాని తాత్కాలికమైన శాంతి నిచ్చేదికారాదు. అది క్షణికోద్రేకాలకు దోహద మిచ్చేదికారాదు. ఆది శాశ్వతముగా మనస్సుకు శాంతినేకాదు, విశ్వశాంతిని చేకూర్చేదిగా ఉండాలి.

---

# వినతి

ఆంధ్రమహిళ పత్రికలో ప్రచురణార్థం, కథలూ, వ్యాసాలు, నవలలు, ఏకాంకికలూ మొదలైనవి కావలెను. వ్యాసాలు సాధ్యమైనంత వరకూ స్త్రీ సమస్యలకూ స్త్రీ జీవితానికీ సంబంధించినవై వుండాలి. ఆంధ్రమహిళ స్త్రీ రచనలకు ప్రత్యేక ప్రాధాన్యమిస్తుంది. ఈనాడు ఆంధ్ర దేశంలో అసంఖ్యాక స్త్రీ రచయితలు వున్నారు. వారు ఆంధ్రమహిళకు తమ అమూల్య రచనలు పంపి మా పత్రిక విజయానికి తోడ్పడగలరని ఆశిస్తున్నాము. ప్రచురించిన వాటికి యథోచిత పారితోషిక మీయబడును. రచనలు ఈ దిగువ ఎడ్రసుకి పంపప్రార్థన.

ఎడిటర్ : ఆంధ్రమహిళ

7-ఎ. రోజరీ చర్చిరోడ్, శాన్‌థోమ్, మద్రాసు-4

కాలువలుగాగ పూర్ణకలోలములుగ
కలదు నాలోన క్షీరసాగరము నేడు.

అని కృష్ణశాస్త్రి చెప్పినట్లు చెప్పితే అంచం. ఇక శ్రాయోదాయకమైన మాట కర్రపుచ్చుకొని చెప్పినట్టు చెప్పితే హితవుగా వుండదు.

అలంకారవతీ, సరసురాలూ అయిన ప్రియురాలు కర్తవ్యాన్ని బోధించేటట్లు అలంకారయుక్తంగా, రస వంతంగా, ప్రేమతో ధ్వనిప్రధానంగా కర్తవ్యోపదేశం చేయాలి.

వాఙ్మయం సమకాలీన సంస్కృతికీ నాగరికతకూ ప్రతిబింబంగా ఉంటూనే ఉంటుంది. వేదవాఙ్మయం విశేషంగా యజ్ఞయాగాది కర్మలకు సంబంధించినదే అయినా, ఆనాటి రాజకీయ సాంఘిక సంస్థలు, సామాజిక పరిస్థితులు, పౌరజీవనం, వృత్తులు, ఆటపాటలు, స్త్రీలస్థానం మొదలైన అనేకవిషయాలు ఆవాఙ్మయంలో అంతర్నిహితమై ఉండి. వాటిని గురించి కొంతకు కొంత మనం తెలుసుకోగలుగు తున్నాం.

హోమర్ కవి ఆడిసీ అనే తనకావ్యంలో ఆడిస్యూస్‌ను వర్ణిస్తాడు. అతడు ప్రజలను తండ్రివలె దయతో చూస్తూ ఉండేవాడు. దైవభీతి కలవాడు. ధర్మరక్షకుడు. అతని పేరు చెప్పితే గోధుమలూ, యవలూ పుష్కలంగా పండేవట. చెట్లు పండ్లతో నిండి ఉండేవట అతని రాజ్యంలో, పశుసంపదా, మత్స్యసంపదా విరివిగా ఉండేవట. అతని నాయకత్వంలో ప్రజలు ఐశ్వర్యంతో తుల తూగుతూ ఉండేవారట.

ప్రజల ఆదర్శాలూ, ఆకాంక్షలూ వారి సంస్కారాన్ని బట్టే వుంటాయికదా. రాజు ఎలా పరిపాలించాలో, ప్రజల వాంఛితార్థా లేమిటో సాహిత్యంలో బాగా చెప్పబడిఉంది.

వానలు సరవితో వర్షించె సస్యముల్
వేళ్ల గొల్చుగ విఱ్ఱవీగి పండె
ఆరోగ్య పుత్ర పౌత్రైశ్వర్యవంతులై
బ్రదికిరి నూఱేండ్లు పంచజనులు
పూవుబోడులు పతిదేవత లై రగ్ని
భయతస్కర వ్యాధి భయము లడగె
ఫల పయః కుసుమాది బహు పదార్థంబులు
రసగంధ సామాగ్రి నెసక మెసగె

ఈత్య పద్రవ మృత్యు రాహిత్య యుక్తి
ధర బ్రజావృద్ధి తామరతంప మయ్యె
న్యాయ పథమున స్వారోచిషాఖ్య మనువు
శ్రీల పెంపొంది పాలించు కాలమునను.

ఇది స్వారోచిష మనువు కాలంనాటి పరిస్థితులు. ఈ కాలపు పరిస్థితులనూ, ఆదర్శాలనూ వర్ణింప వలసివస్తే ఇలాంటి పద్యంలో వేరువిధంగా చెప్పవలసి వస్తుంది కదా. ఈనాటి పెద్దన ఎవరైనా ఉంటే ప్రజాభివృద్ధి తామరతంపరగా అవడానికి ఒప్పుకోడుకదా! ఇంకా ముందుముందు వర్షాలు పడకపోతే కృత్రిమవర్షాలు కురిపించేవారు అని కవులు వ్రాయవలసి వస్తుంది. ఫల పయః కుసుమాది బహు పదార్థాలకు కొరత ఏర్పడిందనీ, వాటిలో రస సౌరభాదిగుణాలు కూడా లోపిస్తున్నాయని వర్ణించాలి ఈనాడయితే.

ఇంకొక ఉదాహరణగా కాళిదాసు రచనలు తీసుకుందాం.

శైశవే అభ్యస్త విద్యానం యౌవనే విషయైషిణామ్
వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతేతను త్యజామ్

శైశవంలో విద్య అభ్యసించాలనీ, యౌవనంలో విషయసుఖాలు అనుభవించాలనీ, వార్ధక్యంలో మునివృత్తి అవలంబించాలనీ అంతంలో యోగబలంతో తనువు విడిచిపెట్టాలనీ ఆదర్శం. రఘువంశంలో చెప్పిన ఈ ఆదర్శం ప్రాచీన ఆర్యకాలంనాటిదే అయినా కాళిదాసు ఉండిన గుప్తకాలంనాడుకూడా ఈ ఆదర్శాలకు ఆదరం మిక్కుటంగానే ఉండేది.

కాళిదాసురచనలను బట్టే ఆనాటి రాజనీతి, దండనీతి, మంత్రులు, వారి విధులు, రాజ్యపాలన, సంఘపరిస్థితులు మొదలయిన వాటినిగురించి అనేకవిషయాలు తెలుస్తున్నాయి.

కుమార సంభవంలో 'కన్యేయం కులజీవితం' అని వుంది. శాకుంతలంలో- దుహితాం శకున్తలా మతిథి సత్కారాయ నియుజ్య- అని చెప్పబడింది. వీటిని బట్టి ఆనాడు మహిళలకు ఎట్టిగౌరవం ఇచ్చేవారో తెలుస్తోంది.

సౌకుమార్యభావం సంస్కారం. తత్కాల సంస్కారం కావ్యాలలో ప్రతిఫలిస్తుంది కదా. అలాగే కావ్యాలలోని పాత్రల సంస్కారం ద్వారా చదువరుల సంస్కారం కూడా వృద్ధిపొందుతుంది.

ఆశ్రమంలోని చెట్లకు మొదట నీళ్లు పోయకుండా తాను తాగేదికాదట శకుంతల. తనకు అలంకారా లంటే ఎంత ఇష్టమున్నా, చెట్లమీది ప్రేమచేత చిగుళ్లను చిఽ

# సాహిత్యమూ సాంస్కృతిక ప్రయోజనమూ

వా సి రె డ్డి సీ తా దే వి

సంస్కృతి అనే శబ్దాన్ని మనం ఈనాడు "కల్చర్" అనే ఆంగ్లశబ్దానికి పర్యాయపదంగా వాడుతున్నాం. దున్నుట, ఆరాధించుట అనే అర్థాలు గల లాటిన్ ధాతువునుంచి పుట్టింది కల్చర్ అనే ఆంగ్లశబ్దం, ఈ శబ్దాన్ని పాశ్చాత్య ప్రపంచానికి బాగా పరిచయం చేసిన వాడు బేకన్. ఆయన అభిప్రాయంలో కల్చర్ అన్నది సమగ్రమైన ఆధ్యాత్మికజీవనం. కర్మతోకంటె చింతనతో ఎక్కువ సంబంధం కలది. మాత్యూ అర్నాల్డ్ దానికి అంతకంటె విపులమైన అర్థం చెప్పాడు. కేవలం ఆధ్యాత్మికంగానే కాక మానవశక్తిని అన్నివిధాలా వికసింపజేసేది కల్చర్. ప్రకాశం, మాధుర్యం వీటికోసం ప్రబలమైన వాంఛ కల్చర్ అంటాడు ఆయన.

'యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే' జ్ఞానంవల్ల కలిగేఫలం కర్మవల్లకూడా కలుగుతుందని గీత చెబుతోంది. ఇక 'సంస్కృతి' శబ్దం. సమ్ అనే ఉపసర్గతో కూడిన 'కృ' ధాతువుతో సంస్కృతి శబ్దం ఏర్పడింది. ఏ కార్యంవల్ల శోభ కలుగుతుందో అట్టికార్యం సంస్కృతి. లౌకిక పారమార్థిక ఆర్థిక రాజకీయ సామాజిక విషయకంగా అభ్యుదయం సాధించడానికి మనసా వాచా కర్మణా మానవుడు చేసే యోచనలతో, అతడు ఉపయోగించే శబ్దాలతో, చేసే కర్మలతో వీటన్నిటితో సంస్కృతికి సంబంధంఉంది అనే విశాలమైన నిర్వచనం మనం చెప్పుకోవాలి.

సంస్కృతి అంటే సభ్యతకూడా. (ఆర్య సభ్యతాకా రహా సదా యహీ పరిణామ్ జీనేఁమే బస్ జ్యోతిహో మర్‌నేమేఁ నిర్వాణ్) అంటాడు ప్రసిద్ధ హిందీకవి మైథిలీ శరణ్ గుప్త. జీవనంలో జ్యోతి, మరణంలో నిర్వాణం ఇదే ఆర్యసభ్యతా పరిణామం. ఈ సభ్యత నిత్య వ్యవహారంలో, వేషభాషలలో, సంభాషణలో, భోజనాదులలో, మానవుని ప్రతికార్యంలో కనిపిస్తుంది.

సంస్కృతిని నాగరికతతో కూడా అన్వయించుకొనవచ్చును. సహజపరిస్థితులను మానవుడు తన సౌకర్యం కోసం వశం చేసుకోవడమూ నాగరికత అవుతుంది. గృహనిర్మాణమూ, పట్టణ నిర్మాణమూ, విజ్ఞాన ప్రగతీ, సాంకేతిక పురోగమనమూ నాగరికతాభివృద్ధికి దోహదం చేస్తాయి.

సంస్కృతి అంటే లాలిత్యంకూడా స్ఫురిస్తుంది. సంస్కృతి అంటే సంస్కారం, పరంపరాగతమైన ఆచారవ్యవహారాదికం. అద్దంమీద మురికిని ఏదైనా పొడినివేసి తోమి శుభ్రం చేయడం సంస్కారం. నూనే రంగు మొదలయినవి వాడి వస్తువులకు మెరుగు పెట్టి సుందరంగా చేయటం సంస్కారం.

లాలిత్యార్థంలోనే ఈనాడు లలితకళలకు సంబంధించిన కార్యక్రమాలకే విశేషంగా సాంస్కృతిక కార్యక్రమాలనడం పరిపాటి అయిపోయింది.

ఇక సాహిత్యం అంటే ఏమిటి? ఈ శబ్దాన్ని మనం ఇంగ్లీషులోని 'లిటరేచర్' అనే మాటకు బదులుగా వాడుతున్నాం. లిటరేచర్ శబ్దం అక్షరం అనే అర్థం ఇచ్చే లాటిన్ ధాతువునుంచి వచ్చింది. మనసులోని భావాలను లిఖితరూపంగా వ్యక్తపరచడం లిటరేచర్ అవుతుంది. శబ్దరూపమైనభావం వాక్కు. అక్షరరూపమైన వాక్సముచ్చయం వాఙ్మయం. అదే సారస్వతం. సాహిత్యం అంటే హితంతో కూడినది. అంటే ఈశబ్దం వాఙ్మయంయొక్క ఒక విశిష్టలక్షణాన్ని ప్రతిపాదించేదిగా ఉంది అన్నమాట.

సాహిత్యం కావ్యరూపంలో వెలువడుతుంది. కావ్యాన్ని నిర్మించేవాడు కవి. కవి అంటే ఋషి అని కూడా అర్థం ఉంది. 'నాన్ ఋషిఃకురుతే కావ్యమ్' అని చెప్పబడింది. ఋషి కానివాడు కావ్యాన్ని రచించలేడు. ఆదికవి వాల్మీకి ఋషిసత్తముడు కవిద్రష్ట. స్రష్ట, విషయాన్ని సుందరమైన శబ్దాలలో చెప్పితే అదే కావ్యం. విశ్వశ్రేయం లక్ష్యంగా కలది కావ్యమని కూడా చెప్పబడింది. కవితకు భావం ప్రధానం. ఆ భావం రంజకంగా చెప్పగలగాలి.

సాహిత్యం సత్య సుందర శివ స్వరూపమై ఉండాలి. సత్యం చెప్పాలి కదా అని రెండూ రెండూ నాలుగు అన్నట్టుగా ఉండకూడదు. సుందరంగా చెప్పాలి, అంటే లలితంగా చెప్పాలి. నాకు చాలా ఆనందంగా ఉంది అని చెప్పితే అందం ఏదీ.

వెలుగులో అమృతాలో తావులో మరేవో
కురియు జడులు జడులు గాగ పొరలిపారు

మేది కాదట. చెట్లు తొలిసారిగా పువ్వులు పూచినప్పుడు ఎంతో సంబరపడేదట. ఏమి ఆమె వ్యక్తిత్వంలోని లాలిత్యం! ఇలాంటి సంస్కారాన్ని వర్ణించే కావ్యం రసాత్మకం కాదా! సంస్కార దోహదకారి కాదా.!

రావణుని అంతఃపురంలో అనేక సుందరులు వివిధ భంగిమలలో ఉండి నిద్రపోతూ ఉంటారు. హనుమంతుడు సీతాన్వేషణకై వచ్చాడు. తప్పనిసరిగా ఆ దృశ్యాలు చూడవలసి వచ్చింది. కాని ఆయన మనస్సు వికలం కాదు. ఈసంఘటన ఆకవియొక్క సంస్కారానికీ, ఆ పాత్రయొక్క సంస్కారానికీ నిదర్శనం. ఒక బ్రహ్మచారి ఒకపనికి నియుక్తుడై వెడుతూఉండగా అలాంటి దృశ్యం కనబడినప్పుడు ఆవ్యక్తి తనపనిని మరిచిపోయి శృంగార రసంలో పడిపోయాడనుకోండి అది అతని సంస్కారానికి చిహ్నం. అలాంటి సందర్భంలో కవి ఆదృశ్యాన్ని పచ్చిపచ్చిగా వర్ణిస్తాడనుకోండి. అది ఆకవి యొక్క సంస్కారం అన్నమాట.

దుర్మార్గునిలోని మంచి లక్షణాలను కూడ చూడ గలగడం సంస్కారలక్షణం. బలశాలి అయిన రావణుడు అధర్మడు కాకుండా ఉంటే దేవలోకానికీ దేవేంద్రునికీ కూడా రక్షకు డయ్యేవాడు కదా అంటాడు హనుమంతుడు. పరమశత్రువులోని మంచినికూడా చూడ గలిగినవాడు హనుమంతుడు. ఇట్టి సంస్కారాన్ని తనకావ్యంలో ప్రతిబింబింప జేసిన మహాకవి వాల్మీకి.

ప్రబంధయుగంలో ప్రతికావ్యంలోనూ అవసరమున్నా లేకపోయినా అష్టా దశవర్ణనలూ చేయడానికి పూనుకొనడం పరిపాటి అయిపోయింది. అవర్ణనలు కూడా ఒకే అచ్చులో పోసిన బొమ్మలలాగ తయారయ్యాయి అయినా ప్రబంధాలలో ఆకాలపు సంస్కృతినీ నాగరికతనూ తెలియజేసే వర్ణనలు లేకపోలేదు.

ఆముక్తమాల్యదలో నీళ్లకుండలు మోసుకొని పోతున్న తమిళస్త్రీలూ, చేపలవేట, పల్లెపడుచుల పరిహాసాలూ, పాచ్చికప్పిన పాతకొలనులూ మొదలయిన వర్ణనలు చక్కనివి ఉన్నాయి.

సంస్కృతి అంటే సభ్యత అనికూడా చెప్పుకున్నాం. తెలుగు కవులు ముఖ్యంగా స్త్రీ వర్ణన విషయంలో సభ్యతకు సెలవిచ్చి పంపించివేశారని చెప్పాలి. చాలా పద్యాలు అచ్చువేసినప్పుడు మరీ అశ్లీలంగా ఉన్న తావులలో చుక్కలు పెట్టవలసి వస్తుంది.

బాలికను వర్ణించే సమయంలో మాత్రం విధిలేక కొంత సంయమనం కనబడుతోంది. బాలికలను వర్ణించే ఘట్టాలు చాలా తక్కువ.

వృద్ధస్త్రీని వర్ణించినవారు ఎక్కువగా ఉన్నట్టులేదు. కళాపూర్ణోదయంలో పింగళిసూరన వృద్ధురాలినివర్ణిస్తూ "భావజుడు వెళ్ళిపోయిన పాడుమేడ పగిది" ఉంది అన్నాడు.

అర్థంలేకుండా మాట్లాడి విసుగు పుట్టించడం అసభ్యత అనిపించుకోక పోయినా అది అసహ్యం మాత్రం అవుతుంది. ప్రబంధాలలోని పుష్పలావికావర్ణనం, మన్మథ చంద్ర మలయానిల శుక పికాద్యుపాలంభనాలూ, చర్విత చర్వణ ప్రాయమై నవ్యతలేని ఒకే మాదిరి ఇతర వర్ణనలూ చాలా విసుగు కలిగిస్తాయి.

సమకాలిక జీవితాన్ని ఇంపుగా వర్ణించిన కావ్యాలలో ప్రత్యేకంగా చెప్పుకో తగినవి బసవపురాణం, క్రీడాభిరామం, పల్నాటివీరచరిత్ర, పంచతంత్రం, ద్వాత్రింశత్సాలభంజిక, హంసవింశతి, శుకసప్తతి, గాథాసప్తసతీ మొదలైనవి.

హింసవింశతిలో కరణం వర్ణన ఇది

తెలితలపాగ చొక్క మొలతిత్తి
భుజంబున. జల్వపచ్చడం
బలచిటి వ్రేలముద్రిక యొయారము
మీఱ బొగాకుచుట్ట సొం
పలరెడు కావిదోవతి పదాబ్జయుగంబున
ముచ్చె లొప్పగా
నలవిభుడంత గ్రామకరణం
బటకై చనుదెంచి వేడుకన్

ఈనాడు ముమ్మరంగా వస్తూఉన్నకథా సాహిత్యంలోనూ సమకాలీన సంస్కృతి సుస్పష్టంగా చిత్రింపబడుతోంది.

ఉన్నవవారి మాల పల్లెలోనూ, కందుకూరివారి రాజశేఖర చరిత్రలోనూ, చిలమర్తి వారి రామచంద్ర విజయంలోనూ, ఇతరుల అనేక నవలలలోనూ, ఈ విధమైన జీవన చిత్రణం కనిపిస్తూనే ఉంది.

సంస్కృతి అంటే సంప్రదాయం కూడా. పూర్వ సంప్రదాయాలను వర్తమాన పరిస్థితులకు అనుగుణంగా ఉపయోగించుకోవడం విజ్ఞత అనిపించుకొంటుంది,

సాంప్రదాయిక సామగ్రిని పూర్తిగా విడిచిపెట్టకుండా శ్రీ శ్రీ తన అవసరాలకు ఎలా ఉపయోగించుకుంటాడో చూడండి.

భూతాన్ని
యజ్ఞోప వీతాన్ని
వైప్లవ్య గీతాన్ని నేను
స్మరిస్తే పద్యం
అరిస్తే వాద్యం
అనలవేదిక ముందు అస్ర నైవేద్యం.
లోకాట
భవభూతి శ్లోకాలు
పరమేష్ఠి జోకాట నామహోద్రేకాలు
ఆయన ప్రతిజ్ఞ వినండి:
నా రచనలలో లోకం ప్రతిఫలించి
నా తపస్సు ఫలించి
నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ
నా జాతిజనులు పాడుకొనే
మంత్రంగా ప్రయోగించాలని
నా ఆకాశాలను
లోకానికి చేరువగా
నా ఆదర్శాలను
సోదరులంతా పంచుకొనే
వెలుగుల రవ్వల జడిగా
అందీ అందకపోయే
నీ చేలాంచముల విసరుల
కొనగాలులతో నిర్మించిన
నానుడి నీగుడిగా
నా గీతం నైవేద్యంగా హృద్యంగా
అర్పిస్తా.

సంస్కృతి అంటే వైజ్ఞానిక సాంకేతిక ప్రగతికూడా. విజ్ఞాన పథంలో వేగంగా పరుగెత్తుతున్న ఈనాటి ప్రపంచంలో కవి సమయాలు మారకతప్పదు. ఆలోచనల తీరుకూడా మార్పుచెందక తప్పదు.

దాశరథి ఈ కొత్తపోకడలు ఆలకించండి.

ఆద్య పాషాణయుగం పోయి
విద్యుద్యుగం దిగిన ఈనాడు
ఏడ్చేదీమని కన్నీళ్లలో
ఎంతో కొంత విద్యుత్తు పుడుతుంది.

కోతిని మనిషిగా తొలిచిన
కాస్మిక్ రేడియేషన్ బలమే
నాకలంలో చొరబడి నేడు
మనిషిని దేవతగా మలుస్తుంది.

విద్యుత్తుగా ఊహించగల మనకు
మద్యంలా పారే పాత ఛందస్సులో
పద్యం రచించడం పడదా?
అందుకే ఇలా రాస్తున్నా?

ఇది విద్యుత్ ఛందస్సని
అందరికీ తెలిసినదే.
ఇందులోని కవిత్వపు ఎక్స్‌కిరః
హృదయాంతస్సుల్ని శోధిస్తుం

భూమిని చుట్టిన జలనిధి
పోలిక, శాంతనిపించి
యుద్ధాన్ని అరెస్టుచేసి
మరణ శిక్ష విధిస్తాము.

చితిమంటల యుద్ధానికి
ప్రతికవి ఒక ఫైర్‌బ్రిగేడ్
అణ్వస్త్రపు గ్రీష్మానికి
ప్రతీ పద్యం ఒక మబ్బుముక్క.

సమాజ సంస్కృతి సాహిత్యంలో ప్రతిబింబించినట్లే, సాహిత్య స్రష్ట తన సంస్కృతితో సమాజాన్ని ప్రభావితం చేస్తాడు. అత్యంత ప్రాచీనమయిన జానపదగేయ వాఙ్మయం నుంచి అత్యాధునిక సాహిత్య పక్రియవరకూ ఈ ధర్మం ప్రవర్తిల్లుతూనే ఉంది. ఇది భవిష్యత్తుకు కూడా వర్తించే సార్వకాలీన సత్యం.





★

# మరపుకు రాని మధుర స్మృతులు

శ్రీమతి కె. సుగుణమణి

## "ఒరు పెరియా శక్తి ఇరుకుదు!"

చిన్నారి చిట్టి పాపలు, లీల కల్పకం, డాన్సుక్లాసుల కోసరం కల్పింపబడ్డ 'లిటిల్ లేడీస్ ఆఫ్ బృందావనం' నా ప్రథమ సంపర్కం నాటికి ఏడేళ్ళ ఆంధ్ర మహిళాసభగా, మైలాపూరు ట్రాంరోడ్డులో అద్దె యింట్లో వుండేది. ఇతర కార్యక్రమాలతోబాటు 'అమ్మమ్మగారు' సాయంత్రం హిందీ నేర్పుతూ ఉండేవారు. ఇప్పుడు ఆంధ్రమహిళాసభే దుర్గాబాయమ్మగారు, దుర్గాబాయమ్మగారే ఆంధ్రమహిళాసభ అంటే అతిశయోక్తి కాక పోవచ్చుగాని, వీరూ వీరికుటుంబీకుల అందరి గుణగణాలు కలసి మెలసితనం. శక్తి సామర్థ్యాలు, సిరి-సంపదలు, సేవా సద్గుణాలు, విద్యా వినయ సంపన్నత ఇవన్నీ అసలు 'అమ్మమ్మగారి' వర ప్రసాదాలు. ఇంటికీ సభకూ ఎవరు వచ్చినా, అప్యాయంగా "ఏమండీ!" (అని పేరు పేరు చొప్పునపిలిచి) ప్రేమధారలు వర్షిస్తూ ఆ తల్లి నిజంగా, ప్రేమపాశంతో బంధించి వేస్తారు.

లజ్ చర్చిరోడ్డుప్రక్క శ్రీ మిర్జాపూర్ రాణీగారు సభకు విరాళంగా యిచ్చిన స్థలంలోనే మొదట్లో కెండ బీరపాదులుపెట్టేంగాని అచిరకాలంలోనే 31–1–44 న సభ భవనాలకుపూజ్య బాపూజీ చేత, హాస్టల్ బిల్డింగుకు 2-9-45 న శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ గారిచేతా శంకుస్థాపనలు చేయించారు. నాకదే మొదటిసారి మహాత్ముణ్ణి బాగా దగ్గరలో దర్శించడం, బ్రహ్మతేజస్సు ప్రతిఫలించే ఆ కళ్లూ, జగన్మోహనశక్తిగల ఆ మందహాసం, బంగారు రంగులీను శరీరచ్ఛాయ, అంతకంటెపెచ్చు, లౌకిక చింతానిమగ్నమైన ఈ కలియుగంలో, నిరంతర ఆత్మ నిరతుడై, అంతరవలోకనా దృష్టిలోనున్న ఋషిసత్తముడు! ఆదర్శన భాగ్యం ఇలాంటి "మహాత్ములపాద రేణువు"

మోగద అనిపించింది! పద్మాసనస్థుడైయున్న మహాత్ముని పార్శ్వమునవంగి, శ్రీమతి దుర్గాబాయమ్మగారు "నీ ఆశీర్వాద బలంతో ఆంధ్ర మహిళానభ సేవా సంస్థలలో అగ్రగణ్యత సంపాదించగలదు" అని, వారి ముఖం నిరీక్షిస్తూ, ఆశీస్సులు అర్థిస్తుంటే, "తథాస్తు" అని మహాత్ముని హృదయాంతరాళమూ, దేవదుంధుబులూ కూడ, పలికేయూ అనిపించింది!

ఇనుము వగైరాల కిబ్బందైన ఆ యుద్ధకాలంలో కూడ, రికార్డుటైములో కట్టడులు సాగేయి. ఆస్థలం ప్రక్కనొక పెద్ద చెరువుండేది ఆ రోజుల్లో. ఈ సందర్భంలో శ్రీ రాజగోపాలాచారిగారు ఒకప్పుడు ఉపన్యసిస్తూ, "భవనాలు చూస్తుండగా లేపేస్తున్నారు, పునాదులు గట్టిగా వుండాలిసుమా!" అని నర్మగర్భితంగా హెచ్చరిస్తూ, దీనికంతకూ కారణం "దుర్గాబాయ్ఎన్‌రు-ఒరుశక్తి, ఒరు పెరియా-శక్తి ఇరుకుదు!" అన్నారు. ఈసభ కార్య కలాపాలు, భవనాలు, బ్రాంచీలు, ఇంతట్లో ఇలా (అడయారులోని వటవృక్షంలాగ) శాఖోప శాఖలుగా విజృంభించి, బహుజనోపయోగాలై, ఈ 1962 సం॥ లో సిల్వర్ జూబిలీ చేసుకున్న దీఅంటే ఇదంతా ఏ తల్లిచలువో! ఆ అమ్మను గన్నయమ్మ, ఆ బెన్నూరి కృష్ణవేణమ్మ, ఆ యూనివర్సల్ 'అమ్మమ్మగారికి' ముందుగా మా అందరి నమోవాకాలూ అందజేయకుండా ఎలాగుంటాం!

## పెంచిన ప్రేమానుబంధం : :—

మా పెళ్లైన కొత్తలోనూట, శ్రీ కేసరిగారి అమ్మాయి 'గృహలక్ష్మి' మమ్మాకర్షించింది, కోయంబత్తూరునుంచి 'పుష్పాల'తో ప్రారంభించి, సుమారు (1941 వరకు) నాలుగేళ్లపాటు ఆమెను అలంకరిస్తూ, చతుష్షష్టికళలు, విద్యలు పాఠాలుచెప్పి విడిచేసేం! ఎన్నో స్థలాంతరాలకు బదిలీలై, ఢిల్లీవగైరాలు తిరిగి, 1944 లో మద్రాసు చేరేం, శ్రీమతి దుర్గాబాయమ్మగారి వీరగాథ, సేవాపరతలు చాల కాలంగా వింటున్నాం. ఇప్పుడు వారిపరిచయ భాగ్యం కలిగించుకున్నాం. అడపా తడపా 'ఆంధ్ర మహిళ' చిట్టిపాపను నా చంకన బెట్టేవారు. అంతకుముందే కస్తూర్బాస్మారకనిధి ఆంధ్రరాష్ట్ర కార్యదర్శినిగా శ్రీమతి దుర్గాబాయమ్మగారు పనిచేస్తుంటే నేనుకూడ వారితో కూడ "వార్ధాయాత్ర" వెళ్ళాను. అఖిలభారతకమిటీ వారు మెచ్చుకున్నారు. "వ్యవహారం చక్కగా సమర్థించడంలో ఆంధ్రరాష్ట్ర కమిటీ ఫస్టని!" 1946 డిశంబరులో ఢిల్లీకాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీకి మెంబరుగా వెళ్ళిపోతూ ఆంధ్రమహిళను పూర్తిగా నాకు వప్పజెప్పారు. మాకు "పాడీ పంటలు" అనే అబ్బాయివుంటే, ఆ అబ్బాయికి 'ఆంధ్ర మహిళ' ఈడూ జోడూ ఔతుందేమోనని, తద్వారా సమగ్ర సేవకు అవకాశమౌతుందని ఆశించేం. పేరుబలాలు బాగానే వున్నాయిగాని, అమ్మాయి రెండేళ్ళు పెద్దదౌతుందన్నారు భూషణంగారు! 'పాడి పంటలు' గ్రామస్థులబిడ్డ, 'ఆంధ్రమహిళ' పట్నవాసి. మొదట్లో 'పెరట్లో కూరగాయల పెంపకం' గ్రామీణ నాగరికత పరిశ్రమలు' వాటిల్లోకూడా (అభి) 'రుచులు' కలిగించాలని యత్నించేంగాని, పట్నవాసం మమత మారేటట్లు లేకుంటే, ఇక ఆంధ్రమహిళ పాడిపంటల్ని అక్కా తమ్ముళ్ళులా జతపరచి సాకుతూ వచ్చేం. అమ్మమ్మగారు శ్రీయుత నారాయణరావుగార్ల సలహాలతో 1947 జూన్‌నాటికి క్షేమంగా అమ్మాయిని పుట్టింట వప్పజెప్పేం. మాకు బదిలీ రావడంవల్ల! "ఆంధ్ర" రాష్ట్రావతరణంతో మళ్ళా మేము మద్రాసు రావడం. పెంచిన ప్రేమ చొప్పున ఆంధ్ర మహిళ మా దగ్గరకు చేరడం. మరో రెండేళ్ళలో బదిలీవల్ల ఎడబాటు జరిగేయి. ఇలా ఆడపిల్ల వారి సంబంధం కుదరక పోయినా, ఏ వియ్యమూ అందక పోయినా. శ్రీమతి అమ్మమ్మగారు, దుర్గాబాయమ్మగారు వగైరాల నెయ్యమూ, ఆవాజ్య ప్రేమాదరణలూ అలా అందరినీ బంధించి వేస్తాయి ఇందలి సత్యం వారి పరిచయస్తులందరికీ స్వానుభవం

## పట్నవాససేవ పల్లెటూళ్ళసేవ

1944–45 లో ఆంధ్ర మహిళాసభ దశరా ఉత్సవాలకు గొప్ప ప్రదర్శన ఏర్పాటుచేసి పట్నం ప్రజానీకాన్ని అద్భుతంగా ఆకర్షించింది. అప్పుడు గాంధీగారి ఊహలు జ్ఞప్తికితెస్తూ, ఈ సేవలు గ్రామసీమలకు పాకాలని మావారు నాతో వాదించారు. "పట్నాలన్నీ ఒక్కరాత్రిలో నాశనమైనా నేను విచారించను; నిజమైన భారతావని లక్షలాదిగ్రామాల్లో నివసిస్తుంది, ఆమె సంస్కృతి, గ్రామీణ ప్రజల జీవితాల్లో, భద్రపరచబడియుంది. పట్నవాసులు పాశ్చాత్యానుకరణచే నవ నాగరికతా వ్యామోహనా వివశులు. గ్రామపునరుద్ధరణమంటే, వారి దృష్టిలో, గుళ్ళు గోపురాలతో

సహా పూర్తిగా పునాదులతోపీకేసి, క్లబ్బులు యిత్యాది వాతావరణంలో జరగాలను కుంటున్నారు. ఇవి తప్పు టభిప్రాయాలు!! ఐతే ఇలా శ్రీమతి దుర్గా బాయమ్మగారితోటే చెప్పండన్నాను. చెప్పడంకంటే వ్రాస్తే మంచిదని వ్రాసి యిచ్చేరు.

మన సంస్థలవంటి సంస్థల కార్యకలాపాలన్నీ ముఖ్యంగా పట్నవాసులకేగాని గ్రామస్థులకంతగా ఉపకరించడంలేదనీ, వారి శారీరిక ఆకలి, మానసిక తృష్ణాకూడ తీరడంలేదనీ (ఒక మహానుభావుడు చెప్పి నట్లు "The hungry sheep look up and are not fed") అనీ ఇలాంటి ధోరణిలో వ్రాసేరు. ఏనాటి కైనా ఈ సేవలు దేశమంతట, మూలమూలలకు, పాకకుండా ఉంటాయాఅని సంతుష్టితో ఎదురుచూస్తు న్నాం. శ్రీమతి దుర్గాబాయమ్మగారు ఢిల్లీ వెళ్తున్న సందర్భంలో "వెళ్ళిరండి, దేశంలో ఘన కార్యాలు జరగనున్నాయి" అని ఆంధ్రమహిళ వీడ్కోలు వ్రాసింది. అనతి కాలంలోనే వారు అఖిలభారత సోషల్ వెల్ ఫేర్ బోర్డు ఛైర్మనులై దేశమొత్తం మీద స్వచ్ఛంద సంస్థలద్వారా బ్రహ్మాండమైన సేవ గావించడం కళ్లారాచూచి, చెవులారవిని ఆనం దించేం. ఆంధ్రమహిళా సభ, తదితర స్వచ్ఛంద సంస్థల కృషి ఫలితంగా దేశంలో రాష్ట్రానికొక్కొక్క దుర్గాదేవి తయారైనా, వ్యవస్థాపకుల కృషి ఫలిస్తుంది, ఆశయసిద్ధి నెరవేరుతుంది; గ్రామాభ్యుదయం, స్త్రీ జనాభ్యుదయం ద్వారా సమగ్ర దేశాభ్యుదయం జరుగుతుంది.

## 16 ఏళ్ళముందు చూపు :-

1945 వ సం॥లోనే శ్రీమతి దుర్గాబాయమ్మగారు ఆంధ్ర మహిళా విద్యాపీఠమనీ, "జాతీయవిద్యా విధానాన్ని" రూపొందించే కమిటీ అనీ, శ్రీమతి పొణకా కనకమ్మగారు, శ్రీమామిడిపూడి వెంకట రంగయ్యగారు వగైరాల్ని నియోగించడంచూస్తే వారి దూరదృష్టి ఎలాంటిదో అవగతమౌతుంది. ఇటీవల ఇలాంటి కమిటీ దేశమొత్తంమీదనే సాకారం దాల్చడం ఆసంకల్ప బీజమేనని హర్షించాము; ఐతే ప్రభుత్వంవారు ఇందుకుతగిన ఆలోచన, ధనమూ యివ్వలేక పోవడంచూచి గర్హించాము.

## సంకల్పబలిమి :-

1957 ఆఖరులో హైదరాబాద్ చేరుకున్నాం. సమయానికి వచ్చారు, శ్రీమతి కమలాదేవి ఛటో పాధ్యాయ స్త్రీలకు ప్రాంతీయ శిక్షణకేంద్రం చేతి పనులు నేర్పటానికై పెట్టమని తొందర పెడుతూందని శ్రీమతి దుర్గాబాయమ్మగారు మాతో చెప్పారు. ఆ తర్వాత బర్కత్‌పురంలో ఆంధ్రయువతీమండలి కెదు రుగా నున్న భవనం కుదర్చడం, రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్ గారిచే 9-7-58న ప్రారంభోత్సవం జరిగించడం, అన్నీ- ఆసంకల్పసిద్ధురాలి సామర్థ్యం అదెట్టి తపోమహిమో, తలపెట్టినపని, సాకారందాల్చి తీరవలసిందే.

## చరిత్ర చర్విత చరణం కావచ్చు :-

అన్ని కార్యకలాపాలు మద్రాసులోనే యైతే, ఆంధ్రుల ముఖ్యపట్టణమైన హైదరాబాద్‌లో సొంత స్థలం, సొంతభవనాలు ఎందుకుండకూడదు? ఈ సంకల్పం నెరవేరేవరకు, ఆంధ్రప్రభుత్వం, అడిక్‌మెట్ట (విద్యానగర్) రైలుస్టేషనువెనుక నాలుగు ఎకరాల స్థలంయిచ్చేవరకు విరామం ఎక్కడ? స్థలం వచ్చేసింది. ఇక భవనాల నిర్మాణం పూర్తియైతేగాని విశ్రాంతికి వీల్లేదు. భవనాలు పూర్తికాగానే, బహుజనోప యోగమైన కార్యక్రమం రూపొంది, ప్రజాసేవలో పూర్తిగా నిమగ్నమయ్యేవరకు ఆగేదెక్కడ? ఇలా విరామమెరుగని నిరంతర నిధిధ్యాసా, సంకల్పపటిమా, సేవాపరతా, ఏయమ్మసొమ్ము? ఆమెపేరే ఎంతో ప్రబోధకరం- దుర్గాబాయ్ (అంటే శక్తిస్వరూపిణి) సార్థక్యనామధేయం. ఆమధుర నామం బెవరు వినిచిరో! ఆపూజ్యదంపతులకు, ఈరజతోత్సవ సందర్భంలో, ఆంధ్రలోకం, భారతదేశం జోహారులర్పిస్తూంది.



# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తికలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంచే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు.




అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు-4
బొంబాయి-1.
కలకత్తా-7

# నాలిక చివర

## శ్రీ "సారధి"

"స్త్రీ స్వాతంత్ర్యమే నా ప్రధానలక్ష్యం. మహిళలందరు ప్రతిపనిలోనూ సహాయపడ్తూ దేశ ఔన్నత్యానికి పాటుపడాలి. దేశ పురోగమనానికి వాళ్ల సేవ అవసరం. ఇప్పుడు మహిళలు గడించిన కీర్తి అమోఘం" కంచుగంటలా ఖంగున మ్రోగుతోంది పార్వతీశం గొంతు.

అంతటి బ్రహ్మాండమైన బహిరంగసభలో పార్వతీశం ప్రసంగిస్తున్నాడు. కొన్ని వందల మంది అతని ప్రసంగాన్ని వింటూ తన్మయత్వం జెందుతున్నారు. ఆ ప్రజానీకంలోని మహిళలందరికి పార్వతీశంపై ఓవిధమైన గౌరవమేర్పడింది. అతని లక్ష్యాన్ని అందరు శ్లాఘించారు. కొందరు పార్వతీశం భార్య జమునను చూచి ఓర్వలేకపోయారు. పార్వతీశం లాటి భర్తను పొందడం ఆమె అదృష్టమని, ఆమెను మనసారా అభినందిచారందరు.

వేదికపై గంభీరంగా నిల్చుని తన భర్త ప్రసంగించడాన్ని, ముందువరుసలో కూర్చొని వింటున్న జమున, ఆవాక్చాతుర్యానికి ఆశ్చర్యపడ్తూ ఆనందపడ్డది.

ఆనాటి సభ జయప్రదంగా ముగియడంతో అందరి దీవనలు, ఆశీర్వచనాలందుకుని సంతోషంతో ఆ దంపతులిద్దరు ఇల్లు చేరారు.

ఇది జరిగిన సరిగ్గా నాలుగు రోజుల తర్వాతనాటి వుదయం—

"ఏమండీ"

"వూ" పేపరు చదువుతూ తలెత్తి ప్రశాంతమైన జమున ముఖాన్ని చూసాడు పార్వతీశం.

"మరేం లేదండి. చాలా రోజులుగా నాకొక ఆశ"

"ఏమిటా ఆశ"

"మహిళా మండలి కార్యకలాపాలలో పాల్గొని, ఆ సంస్థ ప్రగతికిపాటు పడాలనుకుంటున్నాను."

"అందుకని"

"ఏం లేదు. ఈసారి కార్యదర్శినిగా అందరు నన్నే ఎన్నుకుంటారట. మీరు "సరే" నంటే నా సమ్మతిని వాళ్లకు తెల్పుతాను."

"అది మాత్రం నా వల్లకాదు. జమునా, నేనేదో మీటింగులలో స్త్రీల స్వతంత్రాని గురించిమాట్లా డినంత మాత్రాన, నా భార్యని మహిళామండలిలో తిరగని స్తానను కున్నావా" కోపంతో అరిచాడుపార్వతీశం.

ఏమిటీ, తన భర్తేనా ఇలా మాట్లాడుతున్నదనుకుని నిర్విణురాలైపోయింది జమున. అతని ముఖాన్ని చూస్తుంటే ఆమెకసహ్యమేసింది. లోకాన్ని తన మాయ మాటలతో మోసపుచ్చుతున్నాడనుకుంది

"అయితే మీ మాటలంతా తేనె లొలుకుపలుకలేనా మరి"

"అదంతా నీకనవసరం. నీవు కార్యదర్శినిగా అడ్డమైన వాళ్లతో తిరగడం నాకిష్టంలేదు.

"మీ ఆదర్శాలను ఆచరణలో పెట్టాల్సిన బాధ్యత మీది కాదా"

"నా ఆశయాలు, ఆదర్శాలు నాకు బాగా తెలుసు. నీవు చెప్పాల్సిన పనిలేదు. అతిగా వాగావంటే అసలు మహిళా సమాజం "మెంబరు షిప్"కు కూడ తిలోదకాలిచ్చుకోవలసి వస్తుంది. ఆవిషయం జ్ఞాపకముంచుకో"

"ఇదేనా మీ నిర్ణయం" బ్రతిమాలింది జమున

"నా నిర్ణయానికిక తిరుగులేదు....హు ..వెళ్లు నన్ననవసరంగా బాధించకు.' పేపరు చదవడంలో నిమగ్నుడయ్యాడు పార్వతీశం.

రెండు క్షణాలలా తనభర్తవంక తదేకదృష్టితోచూసి పొంగివచ్చే కోపాన్ని అపుకుంటూ, పాలిపోయిన ముఖంతో లోనికి నడిచింది.

"పార్వతీశం"

"ఎవరూ"

"స్ప్రింగుడోర్ తెరచుకుని లోన జొరబడ్డాడు సారధి. తన రూంలో ఒంటరిగా కూర్చొనివున్నాడు పార్వతీశం.

"ఏంరా అలాగున్నావ్"

"నా మనస్సేం బాగుండలేదు"

"ఎందుకని"

"........."

''పోనీలే నీ జవాబనవసరం....నాకో విషయం తెలిసింది అది నిజమేనంటావా?

"ఏమిట్రాది''

"ఒరేయి నీకు తెలియనట్టడుగుతున్నావ్ మీ ఆవిడ ఈసారి మహిళాసమాజానికి ఏకగ్రీవంగా కార్యదర్శినిగా ఎన్నుకోబడుతుందట నవ్వుతూ అన్నాడు సారధి.

పార్వతీశానికి ఏం చెప్పాలో తోచక సారధివంక గుడ్లప్పగించి చూశాడు.

''ఏమిట్రా మాటాడనంటావు."

"ఆ విషయం గురించే వుదయంనుంచి నా హృదయంలో ఘర్షణ. నేను బాధపడ్తున్నందుకు కారణం కూడ అదేరా"

"ఇందులో బాధపడడానికి ప్రమేయ మేముంది" అయినా నిన్న భినందిస్తున్నాను. ఎంతోమంది వేదికలెక్కి స్త్రీలకుగాను ఇదిచేస్తాం, అదిచేస్తాం, అంటారేగాని, క్రియారూపంలో ఎవ్వరు ముందుకురాలేకున్నారు. ఆవిషయంలో నీవందరికి చక్కని గుణపాఠం నేర్పుతున్నావు.

పార్వతీశం ఆశ్చర్యపోయాడు...

"సారధి నీవనుకుంటున్నదంతా తప్పు. నాకు మా ఆవిడని కార్యదర్శినిగా ఎన్నుకోవడం ఇష్టంలేదు. ఈ సంగతే జమునకు కూడా చెప్పాను.

ఈసారి సారధి ఆశ్చర్యపోయాడు.

"పార్వతీశం అసలు మాటాడేది నీవేనాఅని"

"ఎందుకా సందేహం"

"నీవు చాలా వుత్తముడవని, సహృదయుడవని మహిళల క్షేమంకొరకు నీవు అహర్నిశలు పాటుపడ్తావని అనుకున్నా ఇన్నిరోజులు, కాని నీవింతటి పయోముఖ విషకుంభుడవని తెలియక పోయింది. అసలు నీలాటి మంచివాడి స్నేహం లభించడం నా అదృష్టమనుకుని ఆనందబడ్డా నిన్నిరోజులు. అయినా నీమాటలు, చేష్టలంతా కేవలం నటనని ఇప్పుడే తెల్సుకుంటున్నా, నీ స్నేహితుడనని చెప్పుకోడానికి నేను సిగ్గుపడుతున్నాను" బాధపడ్తూ అన్నాడు సారధి.

"నన్నాడి పోసుకుంటున్నావు గాని, అసలు మహిళలకు గాను నీవు చేసిన మేలేమిటి" సూటిగా సారధిని ప్రశ్నించాడు పార్వతీశం.

"మహిళలకు నేను చేసిన మేలేమిటో నీకు తెలుసు. ఈ రోజు మనవూరిలో మహిళా సమాజానికాలవాలమయిన ఆ భవనం నాదేనని నీకు తెలుసు. ఒకవిధంగా పురోగమిస్తున్న ఆ సమాజపు పేరుప్రతిష్టల కాధారమా భవనమని కూడా నీకు తెలుసు. ఇకపోతే గత అయిదు సంవత్సరాలుగా ఆ మహిళా సమాజానికి అధ్యక్షురాలిగా వుంటూ, అనేక విధాలుగా సేవ చేస్తున్న మహిళామణి నా మాతృశ్రీ అనీ నీకు తెలుసు. అన్నీ తెలిసి అడగడం అవివేకమే అవుతుంది పార్వతీశం అవివేకమే అవుతుంది'' వుద్రేకంగా ఆగాడు సారధి.

"పార్వతీశం నీవు గడచిన మునిసిపల్ ఎన్నికలలో ఓడిపోయి ఆత్మహత్య చేసుకుంటానన్నావ్ జ్ఞాపకముందా''

''దానికేమిప్పుడు'' విసుగ్గా అన్నాడు పార్వతీశం.

"ఆరోజేమన్నావ్ ఒరేయి సారధి నాభార్య జమున నన్ను వూరడించకుంటే నేను నిజంగా బ్రతికేవాడిని కాదురా. స్త్రీ లాలనలో ఎంతటి కఠిన హృదయుడైనా కరగిపోతాడన్నావ్ ఏమైనాయా మాటలిప్పుడు. ఆ రోజు నిన్ను మళ్ళీ మనిషిగా మార్చి ఈ రోజువరకు నీవు గడించిన కీర్తిలో కొద్దో గొప్పో ఆమె సహాయ వుందన్న విషయాన్ని మాత్రం మరచిపోకురా"

"నీవెన్ని చెప్పినా, నా నిర్ణయం మాత్రం మారదు.''

''ఇదేనా నీ సమాధానం. అయితే నీవారోజు ఆమెకిచ్చిన మాటప్రకారం, ఆమె కోరిక నెరవేర్చాల్సిన బాధ్యత నీపైనుంది కదరా.''

"ఆ వాగ్దానాన్ని జ్ఞప్తికి తెచ్చి నన్ను కించపరచాలనుకుంటున్నావా?"

''నా వుద్దేశమదికాదు పార్వతీశం అయినా ఈ విషయంలో నీ కెందుకింత పట్టుదల.''

''అదంతా నీకనవసరం. నీతో మాటాడడానికి సిద్ధంగా లేను"

సారధి మాటలేం వినిపించుకోకుండా విసురుగా లేచి వెళ్ళిపోయాడు పార్వతీశం. సారధి అలాగే నిశ్చేష్టుడై నిల్చిపోయాడు

ఆ రోజు సాయంత్రం పార్వతీశాన్ని గత ఎన్నికలలో ఓడించిన జగన్నాధం కలుసుకున్నాడు.

"ఏమండీ పార్వతీశంగారు"

"ఏమండీ"

"ఈ సారి ఎన్నికలకు మనడివిజనుతరపున మిమ్మ ఏకగ్రీవంగా ఎన్నుకుందామనుకుంటున్నాం"

పార్వతీశం ఆశ్చర్య పడ్డాడు.

"ఏమిటీ. నన్నా"

"అవునండి. మీకంటె మంచివారు, అందులోనూ ప్రజలకు సేవ చేయడంలో అధికంగా వుత్సాహం చూపే వారు లేరు. అందుకనే మిమ్మ కోరుకుంటున్నాం. నా మాట కాదనకండి, ఒక విధంగా నా భార్య శాంత పట్టు దలవల్లే మీ దగ్గిరకి నే రావాల్సొచ్చింది"

"అలాగా.... ఇంతకీ నేను తగుదునా అని" సందేహంగా పలికాడు పార్వతీశం....

"ఇంకొక విషయం.... నాభార్య మరొక మంచి పని చేయడానికి కూడా సిద్ధ రాలై వుంది..."

"ఏమిటో"

"అదేనండి.... ఈసారికి మీ ఆవిడను మహిళా సమాజ కార్యదర్శినిగా అందరు ఎకగ్రీవంగా ఎన్ను కోడానికి ఇష్టపడుతున్నారు.

పార్వతీశం నిజంగా యోచించాల్సొచ్చిందిప్పుడు.... అందరు తమ మంచినే కోరుతున్నప్పుడు, తను మాత్రం జమునకు అన్యాయం చేయడం బాగుండదనుకున్నాడు...

"సరేనండి... జగన్నాధంగారు.... మీరందరు ఎలాగంటే ఆలాగనిపిస్తాను" సంతోషంతో అడుగు ముందుకు పడింది.

త్వరత్వరగా ఇల్లు చేరాడు పార్వతీశం... జమున ముభావంగా వున్నది.

"జమునా"

"........."

"మాటాడవూ... నన్ను క్షమించు జమునా. నిన్న నవసరంగా కష్టపెట్టి, నీ హృదయాన్ని గాయపరిచాను. నీవు కార్యదర్శినిగా ఎన్నుకోబడడంలో నాకేలాటి అభ్యంతరం లేదు."

జమున పార్వతీశం వంక నమ్మలేనట్లుగా చూసింది. ఆమెను గాఢంగా హృదయాని కద్దుకున్నాడు పార్వతీశం.

ఆ రోజు ఇంట్లో ఒకటే సందడి. ఇల్లంతా కోలాహలంగా వుంది. పార్వతీశం, జమునలు, తామిద్దరు వరుసగా "కవున్సిలరు— మహిళాసమాజం కార్యదర్శినిగా ఏకగ్రీవంగా ఎన్నుకో బడడముద్దేశించి ఓ విందిచ్చారు. ఆ దంపతులిద్దరు విందుకొచ్చిన ఆప్తులందరి మన్ననలు పొందారు. పార్వతీశం సారధిని ప్రత్యేకంగా కల్సుకుని "సారథి, నన్ను మన్నించరా. అనవసరంగా నీ మనసు నొప్పించాను."

"ఛా. వూరుకోరా. ఏమైందిప్పుడు.... అంతా అనుకున్నట్టు జరిగిందిగా.... నీ ఆశాయాలు, అభ్యుదయం ఆచరణలో పెట్టావురా... అదే నాకు చాల సంతోషం."

"నేనుగా పెట్టలేదురా అంతా నీ చలువ. ఇన్నాళ్లు నామాటలంతా పెదవినుంచే వస్తుండేవి. ఇకనుంచి నా పలుకంతా హృదయం నుంచే వస్తుందిరా." "అంటూ జమున ముఖంలోకి చూశాడు సంతృప్తిగా...



# పాపాయి ప్రశ్నలు

శ్రీమతి వెలివల రత్నకుమారి

ఆఫీసుకు పోతూపోతూ
తలుపుచాటున వున్న నిన్ను జూచి
నాన్న యెందుకే నవ్వుతాడు?

తలుపు మూసివుంటేను
'తలుపు' తలుపూ- అంటాడుగాని
పేరుపెట్టి నిన్ను పిలవదేమే?

ఆఫీసునుంచి రాగానే
'అమ్మయెక్కడే' అంటాడుగాని,
'అమ్మాయియెక్కడే' అని
అడగడేమే! అమ్మా?

చిల్లికానీ కావాలంటేను నన్ను
చెవులు మెలేస్తాడేమే?
డబ్బు యెంతడిగినా నీకు
దబ్బున యిస్తాడేమిటే?

కోపమొచ్చి నే నలిగితేను
కోపడతాడేమే?
నీకోపమొచ్చి ముసుగుపెడితేను
మెల్లగా బ్రతిమాలుతుంటాడేమిటే?

నీవు ఫలహారమిస్తుంటేను
నిన్నేమిటే అంటాడు?
చెంగులో తల దాచుకొని
నీవెందుకే సిగ్గుపడతావు?

నీ వంటేను యెందుకే అమ్మ
నాన్నకింత యిష్టం
చక్కగా విప్పిచెప్పవే!
సరదాగా వింటానే!

---

# సత్కారం

## శ్రీమతి రూపాబాయ్ మోతీలాల్

నగారల ధ్వని కైవారమై శబ్దించ నౌబత్, షెనాయి వాద్యబృందాలు తమ కౌశలాన్ని చాటే వుద్దేశంతో ఘనరాగాల్లో సంచారంచేస్తు, తమ పరివారాన్ని ఆనందాబ్ధిలో ముంచేస్తున్నారు. బారులు దీరిన గుఱ్ఱపు రౌతులు అశ్వవేగాన్ని తగ్గించే నిమిత్తం కళ్ళెరమును గట్టిగా బిగించి పట్టుకొని నడుపుతున్నారు. బాగా అలంకరించిన పల్లకీలో సుఖాసీనుడైన మొగల్ సేనాపతి నిశ్చింతతో బాహ్య ప్రపంచాన్ని తిలకిస్తున్నాడు. ఆయుధ పాణులైన వీర యోధానీకం మధ్య పట్టపు ఏనుగ బంగారు అంబారీను తనమేన ధరించిన గర్వంతో గంభీరమైన నడకతో సాగుతున్నది. ఎర్రటి మఖ్‌మల్ పై జరీ, చమ్‌కీల సున్నితమైన పనితనంతో తళతళ లాడుతున్న తెరలు అంబారీ నలుప్రక్కల మూయబడి వున్నవి. అసంఖ్యాకులైన వీరపరివారంతో ప్రయాణం ముందుకు సాగిపోతున్నది.

గ్రామ ప్రజలు ఆ వూరేగింపును వింతతో చూస్తున్నారు. మేళ తాళాదులతో వీరయోధానీకం చుట్టు కొలువ మధ్య చక్కగా అలంకరించబడి పట్టుతెరలతో మూయబడిన ఏనుగ అంబారీను చూచి పెండ్లికూతురు వూరేగుతున్న దనుకొన్నారు. పల్లకీలో వున్న వీరుడే పెండ్లికుమారుడని కూడా వూహించారు, అంత ఆడంబరంగా అలంకృతమైన అంబారీలో వున్న రాకుమారి ఎంతటి సౌదర్యవతియో? ఆమెచేసుకొన్న నూత్నవధు అలంకరణ ఎంత గొప్పగా వుంటుందో? ఉత్సాహ భరితమైన వూరేగింపు ఎక్కడ ఆరంభమైనది? దీని ముగింపు ఎక్కడ? అంబారీలో వున్న అపురూప సుందరి ఎవరు? అని పామరులు తలంచుటలో ఆశ్చర్యమేమున్నది.

అఖండ హిందుస్థానపు మొగల్ చక్రవర్తి ఔరంగజీబు రాజధాని ఢిల్లీ నగరంనుండి తరలిందావూరేగింపు. మొగల్ పాదుషా ముఖ్యదళపతి దౌలత్‌ఖాన్ యీ మహోత్సవానికి నాయకుడు. అతని ఆధ్వర్యాన్నే అలంకృతమైన ఏనుగఅంబారీ సంబరంతో సాగిపోతున్నది. కాని, జనరంజకమైన యీ వూరేగింపు ముగింపు ఎక్కడన్న విషయం దౌలత్‌ఖాన్‌కే కాదు, చక్రవర్తి ఔరంగజీబుకే తెలియదన్న అతిశయోక్తి సుందరి విషయం వెల్లడైన ప్రజల ఉబలాట చప్పబడిపోవచ్చు, పైపెచ్చు ఉబలాట ఉద్రేకంగా కూడ రూపొందవచ్చు.

బంగారు అంబారీలో పట్టుపీతాంబరాల చాటున నవరత్నాలు చెక్కబడిన స్వర్ణపళ్ళెరంలో మొగల్ పాదుషా ఔరంగజీబు పాదుక పర్యటన చేస్తున్నదని ఎలావూహించడం? కేవలం ఒక కాలి చెప్పుకు ఉత్సాహ భరితమైన పట్నప్రవేశమెందుకు? పాదరక్షకు యింతటి రక్షక బలగమెందుకు? ఎందుకీ పాదుకాపర్యటన?.... మొగల్ సర్వాధికారం వ్యాపించని సామంత ప్రదేశాలను లోబరుచుకొనుటకు తంత్రమైన వుపాయాన్ని అన్వేషించాడు పాదుషా పగ సాధించకుండా ,ముట్టడిచేయకుండా, రణగళంలో రక్తం చిందకుండా? కనీసం ఒక్క తుపాకీ తోటా కూడా ప్రేల్చకుండా సామంతులను లొంగదీయుటకు ఔరంగజీబు పన్నిన కుటిలోపాయ ఫలితమే పాదుకా పర్యటనోద్దేశం. తన పాదుకను రాచమర్యాదలలో సామంతులవద్దకు పంపి తనకు చేయవలసిన గౌరవ మర్యాదలు పాదుకకు సమర్పించి మొగల్ పాదుషా ఆధిక్యమును స్వీకరించి, కప్పం కట్టమని శాసించాడు. చక్రవర్తి సర్వాధికారానికి భీతిల్లిన సామంతులు కొందరు నవాబు పాదుకను ఆహ్వానించి, మేళ తాళాదులతో నగరమంతా వూరేగించి, దర్బారు మండపంలో నిండుసభలో తమ పరివారం సమక్షంలో పాదుషా పాదుకను తామే స్వయంగా తమ సింహాసనం మీద అలంకరింపజేసి నవరత్నాలతో పూజించి, రాజ లాంఛనాలతో సత్కరించి, పాదుషా పాదుక ముందర శిరందాల్చి, కరంమోడ్చి, మోకరిల్లి తరించారు. ఆత్మాభిమానంగల సామంతులు ఆ దుర్మార్గుని దురధికారాన్ని ధిక్కరించారు. దాని ఫలితంగా తమ తమ రాజ్యాలను గోల్పోయి అడవుల పాలైనారు. మరికొందరు. స్వాభిమానాన్ని మంటగలిపే నిరంకుశత్వ రాక్షసాధికారంతో పదిహేడు రాజ్యాలను కప్పం కట్టేలాగున చేశాడు ఢిల్లీ పాదుషా ఔరంగజీబు.

'చిత్తం శివునిమీద భక్తి చెప్పులమీద' అన్నట్టు ఔరంగజీబు తన పాదుక యాత్రకు వీడుకోలిచ్చి

పాదుక ఎలాటి అవాంతరాలకు అవమానాలకు గురి కాకుండా రాజగౌరవంతో, కాంచన లాంఛనాలతో దిగ్విజయం సాధించి సురక్షితంగా ఢిల్లీ చేరుకోవాలన్నదే ఔరంగజేబు విచారం.

నవాబు పాదుక దక్షిణ దేశయాత్ర సాగించి పవిత్రమైన కావేరీ ప్రాంతానికి చేరుకొన్నది. తిరుచ్చిరాపళ్ళికి కొంతదూరంలో వున్నప్పుడే మొగల్ సేనాపతి చోళ మండలాధీశునికి దూతమూలంగా తాము బసచేసియున్న కొళ్ళిడక్కరై కు వచ్చి నవాబు పాదుకను స్వయంగా ఆహ్వానించమని అధికార ధోరణిలో కబురు పంపినాడు.

విజయ నగరాధీశునకు ప్రతినిధులై చోళపాండ్య మండలములను పాలించిన ఆంధ్రనాయక రాజు విశ్వనాథ నాయకుల వంశాకురమైన రంగకృష్ణముద్దు వీరప్పనాయకుడు తిరుచ్చిరాపళ్ళిని రాజధానిగా పాలిస్తున్నాడు. తండ్రి చొక్కనాథ నాయకుని మరణానంతరం తన పదునారవ ప్రాయంలో గద్దెనెక్కి శత్రు మేఘాచ్ఛాదితమైన చోళ పాండ్య నాడులలో నాయకుల పాలనను స్థిరపరచి వినుతినందిన వీరయోధుడు. దక్షిణ ప్రాంతాన్ని కీర్తివంతంగా పాలిస్తున్న నాయకచక్రవర్తి ఆస్థానానికే మొగల్ సేనాపతి దూతమూలంగా పాదుకా పర్యటన సందేశాన్ని పంపించాడు. అహంకార భరితమైన నవాబు కోర్కె విన్నదే కొదమసింగంలాగ ఉగ్రుడైనాడు నాయకప్రభువు. ఔరంగజేబు మ్లేచ్ఛ పాలన కిది తార్కాణమని వూహించి, అతని నిరంకుశత్వాన్ని, దురహంకారాన్ని అడుగంట జేయనిశ్చయించెను.

రంగకృష్ణప్పనాయకుడు రాచకీయ వ్యవహారాల్లో తన తల్లి మంగమ్మగారి ఆలోచనలను పొందుట అలవాటు. క్లిష్టమైన పరిస్థితులను పరిష్కరించుట కనువైన సలహాలను సూచించుటలో రాజమాత మంగమ్మ బహుసమర్థురాలు. పై సమస్యకుపర్యవసానం సూచిస్తు మంగమ్మ "రంగకృష్ణా, మీముత్తాత తిరుమల నాయకులు విజయనగరాధీశులకే కప్పంకట్టక స్వతంత్ర రాజ్యంగా ప్రకటించారు. స్వాభిమానమే ప్రభువుల గౌరవం. రాజతంత్ర మన్న నెపంతో ప్రజలగౌరవాన్ని ధ్వంసంచేయుట క్షాత్రవ వీరంకాదు. పాదుకాసత్కారాన్ని తిరస్కరించుటకు నీవెంత మాత్రం వెనుకాడరాదు." అని ఆదేశించిన దావీరమాత.

"అమ్మా, పాదరక్షను పూజించి రాజ్యరక్షణగావించుటకంటె మకుటాన్ని త్యజించుటే మేలు. నాయకుల మకుటం కేవలం భోగలాలసమైన భూషణం కాదు దేశప్రజల మానప్రాణ రక్షణాంశములన్న రత్నాలతో చెక్కబడిన మకుటాన్ని శిరోభారంగా ధరించుట నావుద్దేశంకాదు" అని ఉద్ఘాటించాడు రంగకృష్ణప్ప నాయకుడు.

"అధికార మదాంధునికి కప్పం స్వీకరించుటకు యింతకన్నా మంచిమార్గం గోచరించలేదోమో?. కుమార, మొగల్ సేనాపతి సందేహించని విధంగా సామర్థ్యంతో ప్రవర్తించుట యెంతైనా అవసరం!" అని హెచ్చరించినది రాజమాతమంగమ్మ.

మంత్రిప్రధానులతో సంప్రదించి తనఅభిప్రాయాన్ని విశదీకరించాడు రాజు. తండ్రితాతల వయస్సులో వున్న మంత్రి, సేనాని యిరవైయేళ్ళునిండని రంగకృష్ణప్ప నాయకుని మహోదార్థ్యానికి స్తంభితులైనా, నాయకుని నిశ్చయాన్ని చాలా ఉత్సాహంతో ఆమోదించారు.

* * *

కొళ్ళిడక్కరై తీరంలో యిసుక దిబ్బలపై గూడారాలను వేసుకొని ప్రయాణ బడలికను తీర్చుకొంటున్నారు మొగల్ వీరులు. మెత్తని పట్టుదిండ్ల కానుకొని కాలుమీద కాలువేసుకొని, హుక్కా పీలుస్తున్న దౌలత్ ఖాన్, తిరుచ్చిరాపళ్ళికి దూతమూలంగా కబురు పంపికూడా నాయకరాజువచ్చి ఆహ్వానించలేదే! రాజుగారి ఆరోగ్యం బాగాలేదన్న కబురు నిజమేనా? అని ఆలోచిస్తున్నాడు.

"హుసేన్, నాయకరాజు అస్వస్థ జెందినవార్త నిజమాలేక సాకుపోకులా?" అని తన సందేహాన్ని తీర్చుకొనె నిమిత్తం సహాయ దళపతిని అడిగాడు సేనాపతి.

"నిజమే అయివుంటుంది. రాజుకు కొంచెం నెమ్మతించిన తర్వాత వస్తాడేమో? .... హుజూర్, మీరు వృథాగా దిగులు పడడమెందుకు?" అని అన్నాడు హుసేన్ ఖాన్.

"ఏమన్నావు వృథాగా దిగులు పడుతున్నానా? నన్ను అవమానించినా సహించగలను కానీ, పాదుషా వారి పాదుకనే అలక్ష్యం చేస్తున్నాడే, ఎంతగర్వం.

నవాబు పాదుకకు కొంచెం అవమానం జరిగినా యీ దౌలత్ ఖాన్ తలనేలకొరిగిందన్న మాటే!"

"యాఅల్లా. భయంకరమైన దండన.... పదివేల మొగల్ సైన్యంలో ఏనుగమీద గంభీరంగా వూరేగి వస్తున్న పాదుషావారి పాదుక గొప్పతనం అకాఫర్ కు ఏం తెలుసు?"

"నిజం. ఢిల్లీనగరంనుండి మనప్రయాణం నిరాఘాటంగా సాగింది. ఒక్కొక్క సామంతుడు బాజా బజంత్రీలతో ఎదురైవచ్చి ఎంత మర్యాద చేశారు? ఒక్కమాటలో చెప్పాలంటే ఔరంగజీబు పాదుషా కన్నా వారిపాదుకనే ఘనంగా గౌరవించారు."

"మొండిధైర్యంతో వున్నాడేమో? హుజూర్, పాదుషావారి ఆజ్ఞను తిరస్కరించిన సామంతుల గతేమైంది?"

"ఇంత పెద్ద సైన్యాన్ని చూచి భయపడకుండా మగతనిద్రలో వున్నాడే?"

"మగత నిద్రగిద్రవుండదు. ఒకవేళ నిజంగానే రాజుకు జ్వరమేమో?"

"నేనునమ్మను హుసేన్! పాదుషా పాదుక వస్తున్నదని వింటే జ్వరం, గిరం పారిపోదూ?" అని అంటూ బలంగా హుక్కాపీల్చి పొగను వదిలాడు దౌలత్ ఖాన్.

ఇంతలో సేవకుడు వచ్చి దౌలత్ ఖాన్ కు సలాం చేసి, తిరుచ్చిరాపళ్ళినుండి రాజోద్యోగి వచ్చినట్లు తెలియజేశాడు. రాజుకు బదులు రాజోద్యోగియా? అయితే రాజుకు అస్వస్థతన్నవిషయం నిజమేనని నిర్ధారణ చేసుకొన్న దౌలత్ ఖాన్ ఠీవిగా కూర్చొని, రాజదూతను లోనికి పంపమని ఆజ్ఞాపించాడు.

సగర్వంతో లోనికి ప్రవేశించిన సేనాపతి నరసప్పనాయకుడు, "నాయకప్రభువులు తామే స్వయంగా వచ్చి మిమ్ము ఆహ్వానించాలని చాలా ఉబలాట పడినారు. కానీ మహారాజుల ఆరోగ్యం బాగాలేని కారణంగా రాలేకపోయారు." అని అన్నాడు.

"పర్వానహీ, నాయకరాజు మారాకకు ఎదురు చూస్తున్నారు కదూ?" అన్నాడు దౌలత్ ఖాన్.

"మీకొరకు ఎదురు తెన్నులు చూస్తున్నారు. మీరు రేపే తిరుచ్చిరాపళ్ళికి ప్రయాణం చేయవచ్చని తెలుపమన్నారు ప్రభువులు. దర్బారు మంటపంలో మీకు ఘనమైన స్వాగతం నిశ్చయం!"

"బహుత్ అచ్ఛా, సేనాపతీ! మేము ఎక్కడికి వెళ్ళినా మాకు అడ్డుజెప్పేవారేలేరు. అక్కడక్కడ పాదుషా వారి పాదుకపై బంగారు మొహరీలను కురిపించారు. ముత్యాలు, రత్నాలు అపూర్వ వస్తువులతో నజరానాచేశారు.... తిరుచ్చిరాపళ్ళి నగరాన్ని ఆడంబరంగా అలంకరించి మేము నగరంలో ప్రవేశించేడప్పుడు బాజా బజంత్రీలతో మమ్మెదుర్కొని స్వాగతమిచ్చి, నగరమంతా వూరేగించి కోటలోనికి తీసుకవెళ్ళాలి."

"ఆహా, తప్పకుండా చేయగలము. మీరు చెప్పి మేము చేయుటలో గొప్పేమున్నది దౌలత్‌ఖాన్! రేపు మీరే నేరులో చూచి నివ్వెరపోగలరు"

అని నచ్చజెప్పిన నరసప్పనాయకుడు దౌలత్ ఖాన్ దగ్గర సెలవు తీసుకొని పురాభిముఖుడయ్యెను.

* * *

పాదుషా పాదుకోత్సవం నూతోన్నిత్సాహంతో తరలింది. తిరుచ్చిరాపళ్ళి నగరాన్ని సమీపించినదే దౌలత్ ఖాన్ సహనం తగ్గిపోయినది. నగర ఆవరణలో ఎవ్వరూ ఆహ్వానించలేదు. బాజా బజంత్రీలులేవు. నగరాన్ని కలయజూచాడు. నగరంలో ఎలాటి అలంకారాలు చేయబడలేదని గ్రహించాడు. అడుగడుగుకు అతనికి ఆక్రోషం అధికరించినది. కోటద్వారాన్ని సమీపించాడు. అక్కడకూడా ఆహ్వానించె వారులేరు. అంబారీలోవున్న బంగారు పళ్ళెరాన్ని సేవకుని తలమీదబెట్టి, కోపంతో పళ్ళు పటపటకొరుకుతూ దర్బారు మంటపాన్ని సమీపించాడు. అక్కడా స్వాగతమివ్వడానికి మంత్రిప్రధానులైనాలేరు.... ఆవేశంలో కొంతసేపు అలాగే నిలచాడు.

సావధానంగా వచ్చిన నరసప్పనాయకుడు, "దౌలత్ ఖాన్, ముఖద్వారంలోనే నిలుచున్నారెందుకు? లోపలికి దయచేయండి." అని ఆహ్వానించాడు.

కోపంతో చురచుర లాడుతు దౌలత్ ఖాన్, "సేనాపతీ, నగరంలో ప్రవేశించినప్పుడు మమ్మెదుర్కొని స్వాగతమివ్వలేదు. నవాబుగారి పాదుకకు ఎలా మర్యాద చేయాలన్నది మీకుతెలియదో?" అన్నాడు.

"ఎందుకు తెలియదు? నాయక భూపేంద్రులు తమ అస్వస్థను పాటించకుండా పాదుకను తగురీతిన సత్కరించాలన్న ఉద్దేశంలో సభలో ప్రసన్నమై

వున్నారు. రండి .... రండి .... '' అని అంటు దర్బారు లోనికి దారితీసినాడు నరసప్ప.

దౌలత్‌ఖాన్, సహాయ దళపతులు మున్నగు ముఖ్యులతో సభలో ప్రవేశించాడు. పాదుషా పాదుక వున్న పళ్ళెరాన్ని తలమీదవుంచుకొని భయభక్తితో సేవకుడు నిలచాడు.

అద్భుతమైన శిల్పసౌందర్యంలో నిర్మితమైన నాయకుల సభాభవనం మంత్రిసామంతులతో, సభికులతో నిండి కళకళలాడింది. నాయకరాజు గంభీరవదనుడై రాజసింగంలాగ గద్దెన లంకరించివుండెను. నాయకుల రాజఠీవిని జూచి క్షణకాలం స్తంభించినిలచాడు దౌలత్ ఖాన్. రాజుగారి ముఖంలో అనారోగ్యపు ఛాయ మచ్చుకైనాలేదు. గంభీరమైన వీరవదనంతో నూత్నోత్సాహంతో వున్నట్లు పొడగట్టింది. రాజు సింహాసనం దిగివచ్చి పాదుకనందుకోలేదు. 'మహా గర్వి' అనుకొన్న సేనాపతి కోపాన్ని దిగమింగి, రాజుగారికి సలామ్ చేశాడు.

మహారాజు అదే గంభీర దృష్టితోనే వున్నాడు.

మొగల్ సేనాపతికి ఓపిక తగ్గింది. "మహారాజ్ ! ఇదిగో బంగారు తాంబాళంలో ఔరంగజేబు పాదుషా వారి పాదుక వున్నది. సింహాసనం దిగివచ్చి పాదుక నందుకొని తమ సింహాసనంపై బెట్టి తగిన రాజలాంఛనాలతో పూజించి పాదుషావారి పాలనను స్వీకరించండి" అని వినయ విధేయతను ప్రకటిస్తు అన్నాడు.

రాజుముఖం ఎర్రబారింది. "దౌలత్‌ఖాన్, పాదుకను తీసుకొనివచ్చి మాముందరపెట్టిన తగిన సత్కారం చేయగలము!" అని అలక్ష్యంతో అన్నాడు.

"మహారాజ్, పాదుషావారి పాదుకను క్రిందబెట్టే ఆచారంలేదు. మీరే స్వయంగా పాదుక నందుకొని సింహాసనంపై వుంచి మర్యాద చేయండి. అదే పాదుకకు మీరు చేయు ఉచితసత్కారం." కోపావేశంతో డిగ్గున లేచిన నాయకభూపతి, "ఉచిత సత్కారం పొందే నిమిత్తం పాదుక నాయకుల దర్బారు చేరివున్నది. దళపతీ, పాదుకను క్రింద బెట్టుము !" ఆవేశంతో మందలించాడు.

దిగ్భ్రాంతిజెందిన దౌలత్‌ఖాన్, "రాజేంద్రా ! అవమానంగా భావించబడును," అని బెదిరించాడు.

రాజుగారి కండ్లు అగ్నిగోళములుగా మారినవి. "మర్యాదయిచ్చి, మర్యాద పుచ్చుకోవాలన్నవిషయం ఔరంగజేబుకు తెలియజేస్తున్నాము. పాదుకను క్రింద బెట్టెదవా లేక..." రాజు ఒరినుండి ఖడ్గంతీశాడు. నాయకప్రభువు తన కరవాలంతో పాదుకను గ్రుచ్చి తీసుకొని పళ్ళెరాన్ని కాలితో తన్నెను. ధన్, ధన్, శబ్దంతో బంగారు పళ్ళెరం దౌలత్‌ఖాన్ కాళ్ళదగ్గర పడి శరణందినది.

రంగకృష్ణముద్దు వీరప్పనాయకుడు పాదుకను తన కాలికి తొడిగి, దౌలత్‌ఖాన్‌తో, "సేనాపతీ ! మీ పాదుషా బుద్ధిమేధస్సు యింతేనా? మాకు రెండు పాదుకలు అవసరమని పాదుషాకు తెలియదా?.... ఒక్క పాదుకను పంపమని నవాబుకు ఆదేశించిన దెవరు?' పాదుకను మోసుకొని వచ్చిన నీవైనా గ్రహించలేకపోయావా? .... మూఢుడాపో, తక్షణం ఢిల్లీకి వెళ్ళి రెండవ పాదుకను తీసికొనిరాపో ! .... " అన్నమాటలు సింహగర్జనగా సభామంటపంలో ప్రతిధ్వనించాయి. బలమైన కరతాళధ్వనులతో సభికులు తమ హర్షామోదాన్ని ప్రకటించారు.

"మహారాజ్, ఇది అన్యాయం. పాదుషావారి అమూల్య పాదుకను మీరు తొడిగినది అపచారం !" కోపాన్ని అణచుకోలేక బిగ్గరగానే అన్నాడు దౌలత్ ఖాన్.

"పాదుక పొందవలసిన ఉపచారమిది. మదాంధుడైన మీనవాబుకు తగినశాస్తి. తనపాదుకతో స్వదేశీయుల స్వాభిమానాన్ని జయించనెంచిన ఔరంగజేబు గర్వం అడుగంటినది. ''

ఏమిచేయాలో తోచక, "రాజా ! దీనిఫలితాన్ని గ్రహించారా? '' అని బెదిరించాడు సేనాపతి.

"దౌలత్‌ఖాన్ ! నిండుప్రాణాలతో నిన్ను నీపరివారాన్ని విడిచాము. ధైర్యమున్న మాతో యుద్ధం చేసి తన మర్యాదను దక్కించుకోమని పాదుషాతో చెప్పు. వెళ్ళు .... "

"పాదుషాకు బదులు మేమున్నాము ! '' అని విర్రవీగినాడు దౌలత్.

'' కోట వెలుపల సైన్యంతో సిద్ధంగావుండు !' అని అన్న నాయకప్రభువు నరసప్ప నాయకుని వీక్షిం

నరసప్పనాయకుడు ఉద్వేగంలో, "ప్రభువుల ఆజ్ఞకై వేచివున్నాము." అన్నాడు.

కోట వెలుపల మొగల్ సైన్యానికి నాయకసైన్యానికి ఘోరయుద్ధం జరిగింది. నాయక వీరుల పౌరుషం ముందు మొగల్ సైన్యం చిన్నాభిన్నమై చెదరింది. తల తప్పితే చాలని పలాయనం చిత్తగించింది మొగల్ సైన్యం.

చక్రవర్తి ఔరంగజీబు పాదుకను అవమానించడమన్నది సామాన్య విషయంకాదు. చక్రవర్తి పాదుక అయినా, అదివుండవలసిన స్థానం సింహాసనం కాదని నిర్దేశించిన ధీశాలి, రంగకృష్ణముద్దు వీరప్పనాయకులు. ఆంధ్రనాయక రాజన్యుల చరిత్రలో మరపురాని అపూర్వ వీరఘట్టం!

---

సమీక్ష

# పద్మశ్రీ వారి సిరి సంపదలు

నిర్మాత శ్రీ వెంకటేశ్వర్లు, దర్శకులు పి. పుల్లయ్య. నటీనటులు గుమ్మడి, నాగేశ్వరరావు, రేలంగి, నాగయ్య, రమణారెడ్డి, చలం, రాజనాల, సావిత్రి, శాంతకుమారి, గిరిజ, వాసంతి, బాలసరస్వతి మొ॥ వారు.

రఘుపతి నాయుడు (నాగయ్య) సిరిసంపదలతో తులతూగుతున్న మనిషి. ధర్మదాత. ఆయనకు జగపతి, పార్వతి యిద్దరు బిడ్డలు. జగపతినాయుడు (గుమ్మడి) తన తండ్రిని చక్రధరం (సుబ్బారావు) చంపివేశాడని నిందతో చెల్లెలు పార్వతి (శాంత కుమారి) ని, బావమరిదినీ, మేనల్లునీ తమ యింటినుండి పొమ్మంటాడు. జగపతి కుమార్తెలు పద్మ, లత, రమ ముగ్గురు పట్నంలో చదువు సాగిస్తారు. అక్కడనే ప్రసాద్ పద్మతో కాలేజి పోటీలో గెలుస్తాడు. తరువాత పార్వతి వల్ల వాళ్ల బంధుత్వం తెలుసుకొంటారు. పద్మను ప్రసాద్ ప్రేమిస్తాడు.

అక్కడ జగపతి నాయుడు గరటయ్య (రమణారెడ్డి) మోసం తెలుసుకోలేక ఆస్తినంతటిని పోగొట్టుకొంటాడు. నాయుడు జైల్లోవుండగా నాయుడుగారి యిల్లు వేలం లోకివస్తుంది. అప్పుడు ప్రసాద్ ఆ ఆస్తిని వేలంలోకొని మేనమామ పరువునూ పిల్లలనూ కాపాడుతాడు. నాయుడుగారు జైల్లోనుంచి విడుదలై నిజం తెలుసుకొని, తన కుమార్తె పద్మను ప్రసాద్ కిచ్చి వివాహం జరిపిస్తాడు.

పార్వతిగా శాంతకుమారి బాగా నటించింది. గరటయ్యగా రమణారెడ్డి, అతనికుమారుడు ఆర్. కె. మార్‌గా రేలంగి హాస్యం ఆనందం కలిగించారు. పిచ్చివాడుగా చలం నటన మరుపురానిది. ప్రసాద్‌గా నాగేశ్వరరావు, పద్మగా సావిత్రి నటనలు తారస్థాయినందుకొన్నాయి.

గిరిజ తన చిన్నప్పుడు జరిగిన సంఘటనను మనస్సులో పెట్టుకొని నటించిన నటన బాగున్నది. క్రొత్త నటి వాసంతి నటన సుమారుగా వున్నది. "వేణుగానమ్ము వినిపించనే" 'గుడిలో దేవుని గంటలా' అనే పాటలు కడుశ్రావ్యంగా ఉన్నాయి. వేణుసంగీతం వినసొంపుగా వున్నది. సంభాషణలు బాగున్నవి. మొత్తంమీద యీ చిత్రం బహు జనాదరణ పొందగలదు.

—నిర్మల

# పుణ్యవతి రాజబన్సీదేవి

మాజీరాష్ట్రపతి శ్రీ రాజేంద్ర ప్రసాద్ సతీమణి శ్రీమతి రాజబన్సీదేవి సెప్టెంబరు తొమ్మిదవ తేదీన పాట్నాలోని తమ స్వగృహమైన భాజనాగ్‌లో కాలధర్మం చెందారు. ఈమె సుమారు నెలరోజుల బట్టీ దేహారుగ్మతతో-ఆందోళనకరమగు పరిస్థితిలోవున్నారు.

శ్రీ రాజేంద్ర ప్రసాద్ తమ ఆరోగ్య కారణంగా రెండుమాసాల నుంచి ఆంధ్రరాజధాని హైద్రాబాద్‌లో వుంటూవచ్చారు. అక్కడ వుండగానే శ్రీమతి రాజబన్సి దేవి స్థితి కొంత ఆదుర్దా కలిగించగా, సెప్టెంబరు ఏడవతేదీన యీామెని పాట్నా తీసుకెళ్లారు. అక్కడికి వెళ్లిన రెండురోజులకి పతి, పుత్ర పౌత్రుల సమక్షంలో, ఈపుణ్య స్త్రీ అసువులని బాసింది.

వివాహ కాలంనాటికి శ్రీమతి రాజబన్సీ దేవి శ్రీ రాజేంద్రప్రసాద్ యించుమించు సమాన వయస్కులు. బాల్య వివాహాలు ఆచారమైన ఆకాలంలో యీ యిద్దరికీ చిన్నవయసులోనే పెళ్లిఅయింది. పెండ్లినాటికి శ్రీ రాజేంద్రప్రసాద్‌కి పదమూడో ఏడట, అయదోఫారం చదువుతూండేవారుట. పెళ్లి హడావుడితో, వూరేగింపు బడలికతో యీ చిన్నదంపతులిద్దరూ సూత్రధారణ సమయానికి నిద్రతో జోగిపోయారుట.

ఉత్తర ప్రదేశంలో బాలిహ జిల్లాలోని ఓ పల్లెలో జన్మించారీమె. వీరుకాయస్థ కులంవారు. జమిందారులు. రాజబన్సీదేవి మితభాషిణి, మొదటినుంచి ఘోషా పద్ధతులలో పెరిగిన ఈమె, పీలగా పొట్టిగా వుండేదట. ఈమె భర్తతో పాటు రాజకీయ రంగంలోకి దూక లేదుగాని, కుటుంబ వ్యవహారాలు, తన భర్త రాజకీయ పోరాటానికి సంకెళ్లుకాకుండా, ఆయనస్వాతంత్ర్య సమరంలో పాల్గొనడానికి గాను సంపూర్ణ సహకారమూ, అవకాశమూ యిచ్చింది. అరవై అయిదేళ్ల క్రితం వైవాహిక జీవితంలో అడుగు పెట్టిన ఈమె, సీతాసావిత్రుల కోవకి చెందిన సాధ్వీమణి. తనభర్త అభిప్రాయాలను, ఆశయాలను నమ్మినా నమ్మకపోయినా తరతరాలుగా మన భారతావనిలో వస్తున్న ఆశయాలని అనుసరించి భార్యస్థానం, భర్త కనుసన్నలలో మెలగడమే అన్న దృక్పథంతో, అతి సహజంగా తన భర్తని స్వాతంత్ర్య సమరానికి అర్పితం చేసింది. ఈమె నిశ్శబ్దమైన త్యాగ జీవితం రామాయణంలోని ఊర్మిళా దేవిని జ్ఞప్తికి తెస్తుంది.

శ్రీ రాజేన్ బాబు కుటుంబ వ్యవహారాలు ఏనాడు పట్టించుకునేవారు కాదుట. అతి బాల్యంలో వివాహం, ఆపైనచదువు, ఆతరువాత వున్నతవిద్య. న్యాయవాద వృత్తిలో కొంత కాలం నిమగ్నం కావడం, యీలోగా బాపూజీ పిలుపుతో స్వాతంత్ర్య సమరంలోకి దూకారు. నిరంతర వ్యాపకాలతో సతమత మవుతున్న యీ యనకి సంసారం, భార్య వీటిని గురించి ఆలోచించే వ్యవధి వుండేది కాదుట.

ఆదినుంచి పర్దాలో పెరిగిన ఈమె తొలిసారి బొంబాయిలో భర్త కాంగ్రెస్ అధ్యక్షుడయిన సందర్భంలో నలుగురిలోకి వచ్చింది. అప్పుడు కూడా అతి మొహమాటంగా, భర్తనీడలో కలసిపోయిందట. ఈమె సబర్మతీ ఆశ్రమంలో రెండేళ్లపాటు వున్నారు. రాష్ట్రీయ అంధకన్యా మహా విద్యాలయానికీ, మహిళా సంఘానికి అధ్యక్షురాలు.

అరవై అయిదేళ్ళ దాంపత్యజీవనంలో పలు మార్లు భర్తగారు జైళ్ళకీ, లాఠీఛార్జీలకీ గురి అవుతుంటే పెదవిమెదపక సహించింది. అట్లాగే రాజకీయాలలో, భారతదేశపు తొలిరాష్ట్రపతిగా, అనేక విదేశయాత్రలలో భర్తగారు నిరంతరకార్య భారాలలో మునిగితేలుతుంటే

ఈమె జీవితం ఒక విధంగా ఏకాంతంగానే వుండి వుండేదని మనం వూహించుకోవచ్చు. అటువంటి ఏకాంతతని, పెదవిమెదపకుండా భరించి, తన భర్తని మాతృదేశ సేవకు నియోగించడంలో ఈమె అపూర్వత్యాగం చేసిందనే అందరూ వొప్పుకుని తీరాలి.

రాజన్‌బాబు భారత రాష్ట్రపతి అయిన తరువాత కూడా ఈమె, రాష్ట్రపతి భవనంలో అతి నిరాడంబరంగా, సర్వసామాన్య గృహిణివలె తన పతి సేవలో గృహకృత్యాల్లో నిమగ్నమయి వుండేదిట.

బహు కుటుంబీకురాలు. తామరతంపరవంటి బలగం గల ఈ పుణ్య స్త్రీ అరవై అయిదేళ్ళ వైవాహిక జీవితం గడిపి, కొడుకులు, కోడళ్ళు, మనుమలు, మునిమనుమలు, కూతుళ్లు అల్లుళ్ళు వీరందరినీ మించి దేవమునివంటి భర్త సమక్షంలో కన్నుమూసిందీ అంటే ఆమెనిజంగా పుణ్యవతియే. అటువంటి సద్గతి కస్తూరిబా, రాజబన్సీదేవివంటి పుణ్యస్త్రీలకే లభిస్తుందేగాని సామాన్య స్త్రీలకి కాదు.

* * *

---

# ఆంధ్ర మహిళా సభ నర్సింగ్‌హోమ్

## ఆర్తోపీడిక్ సెంటర్

ఆంధ్రమహిళాసభ, నర్సింగుహోము, ఈశ్వరీ ప్రసాద్ దత్తాత్రేయ కేంద్రంలో స్వాతంత్ర దినోత్సవం ఆగస్టు 15న జరిగింది. మద్రాసు షరీఫ్ శ్రీ సూర్యనారాయణరావుగారు జండా ప్రతిష్ఠాపన చేసినారు. కేంద్రం తరఫున కార్యదర్శిని శ్రీమతి వి. లక్ష్మీపార్వతిగారు పిల్లల తరఫున కుమారి యశోద, సూర్యనారాయణ రావుగార్కి, తదితర పెద్దలకు సుస్వాగతం చెప్పారు. శ్రీ సూర్యనారాయణరావు గారు స్వాతంత్రం దాని ప్రాధాన్యతను గూర్చి, భారతదేశంలోని భావిపౌరుల బాధ్యతనుగూర్చి వివరించారు. కేంద్రంలో జరుగుచున్న పనిని ఎంతో మెచ్చుకున్నారు. అనంతరం పిల్లలకు స్వీట్సు పంచిపెట్టారు.

అత్యంత ప్రేమాదరాభిమానములతో వచ్చి సభను దిగ్విజయం చేసినందులకు, శ్రీ సూర్యనారాయణరావుగార్కి, పెద్దలకు, కేంద్రంలో వైద్య, విద్యా సౌకర్యాలు పొందుచున్న చిరంజీవి రాజేంద్రన్ తమిళంలో కృతజ్ఞతాభివందనములు తెల్పాడు. జాతీయగీతంతో కార్యక్రమము పూర్తి అయింది.

* * *

3-9-1962 న ఈశ్వరీ ప్రసాద్ దత్తాత్రేయ వికలాంగుల కేంద్రంలోని పిల్లలు వినాయక చవితి, జరుపుకొన్నారు. శ్రీమతి బొబ్బిలి రాణిగారు, వారికుమార్తె శ్రీమతి ఇందిరా దేవిగారు ఆనాటి కార్యక్రమములో పాల్గొని పిల్లలకు స్వీటులు పంచిపెట్టినారు.

కుటుంబ నియంత్రణ సేవికలు, నర్సులు పెద్దలు అంతా పూజలో పాల్గొని, కార్యక్రమాన్ని జయప్రదం చేశారు.

నా టి క

# ఆస్థికోసం

శ్రీ పాలగిరి వేణూజయదేవ్

గత సంచిక తరువాయి

## రెండవ రంగం

(శారద కుర్చీలో కూర్చొని మాగ్‌జైన్ చదువు తుంటుంది. తెరలోంచి "శారదా! శారదా!! తలుపమ్మా! తలుపు" అంటూ కేక విన్పడుతుంది. శారద కుర్చీలోంచి లేచి "ఎవరండీ!" అంటూ తలుపు గొళ్ళెం తీసినట్లు నటిస్తుంది.

ఎనభైయేళ్ళ ముసలాయన రంగంలోకి ప్రవేశిస్తాడు. చేతిలో గొడుగు, కళ్ళకు సులోచనాలు, మెడకు రుద్రాక్షమాలలు, పైన అంగవస్త్రం, పాలభాగాన విబూధి రేఖలు, రేఖలమీద రూపాయంత బొట్టు, అలసినట్లు నటిస్తాడు; వెనక రిక్షావాడూ సామానుతో ప్రవేశిస్తాడు.)

శా : ఆ! బాబయ్యో! ఎపుడొచ్చారు? అంతా కులాసాగా వున్నారా? ఆరోగ్యమెలాగుంది? ఆ! ఆ! గొడుగిలా యివ్వండి. అలసినట్లున్నారు. (గొడుగు తీసుకొని.) ఆ! చల్లని నీళ్ళు త్రాగుతారా, చల్లని మజ్జిగ త్రాగుతారా! అరెరే! ఇంకా నిలబడి వున్నారే!, కూర్చోండి, (కుర్చీవైపు చూపిస్తుంది.)

("కుర్చీలో కూర్చొని) వెంకట్రావు! అబ్బా! అబ్బా!!" అని అంటుంటాడు ఆ! ఏం!) ఆ! ఏం!! కులాసాలే అమ్మాయ్! మీరంతా కులాసేగదూ!

శా : కులాసే బాబాయి....

వెంకట్రావు : ఆ! రామారావు ఆఫీసు కెళ్ళినట్లుందే! ఇంట్లో లేడా.

శా : అవును బాబయ్యా! రెండు రోజులయ్యాక వస్తానని వుత్తరం వ్రాశారూ! మరి మరి అపుడే వచ్చేశారు!

వెం : మొదట్లో అలానే అనుకొన్నాను; కాని నా మామూలుందిగా ఆ! మామూలు నీకు తెల్సుగా చెప్పినరోజుకన్నా రెండురోజులు ముందు రావడం.

శా : అవును, బాబయ్యా! మరిచాను.

వెం : ఇందాక ఏమన్నావ్? చల్లనినీళ్ళా,

శా : చల్లని మజ్జిగ

వెం : అదే! అదే! చల్లని మజ్జిగ తీసుకొని రామ్మా! (శారద లోనికెళ్లుతుంది. మొలలోనుంచి నశ్యం తీసికొని, పీలుస్తాడు వెంకట్రావు. రిక్షావాడు దగ్గినట్లు నటిస్తాడు. వెంకట్రావ్ రిక్షావాడి వైపు చూచి) ఒరే! నీవింకా యిక్కడే వున్నావురా!

రిక్షావాలా; రిక్షా బాడుగండీ!

వెం : ఎంత యివ్వాలేమిట్రా! (అంటూ మొలనున్న మూటను విప్పుకోబోతుంటాడు: శారద ప్రవేశిస్తుంది, చేతిలో మజ్జిగగ్లాసు వుంటుంది; గ్లాసునందుకొని గడగడమని మజ్జిగత్రాగేసి, ఖాళీగ్లాసుటేబిల్ మీదపెట్టి "బ్రేవ్" మని త్రేనుస్తాడు)

రిక్షా; టేసన్నుండి యీ పేటకు ముప్పాలా తీసుకొంటాం; సామాన్నుంది కాబట్టి ఒక్కరూపాయి దయసేయాలండీ!

వెం : ఒక్క రూపాయే! అమ్మో! నాల్గుపావలాలు; ఎనిమిది బేడలు.

శా : ఏమిటి బాబయ్యా! ఇదంతా!

వెం : రిక్షా బాడుగమ్మా! ఆ నా దగ్గిర చిల్లరలేనట్లుంది; నీదగ్గర ఒక పావలా వుంటే వాని ముఖాన వేయమ్మా!

రిక్షా! పావలా! ఎదవపావలా! ఎవరిక్కావాలి! మీరే వుంచుకోండి.

శా : (టేబిల్ డ్రాయర్‌లోంచి చిల్లర డబ్బుతీసి) సర్లే ఈ ముప్పాలా తీసుకో వెధవ రిక్షాలు పాతబండ్లు డొక్కుడొక్కు మంటూను. ఒక్కవాళ్ళు నీలిగి నీలిగి త్రొక్కుతూంటే యింటికిచేరే సరికి వొళ్లు నీళ్లుకారి పోతూంది; వెధవ రిక్షాలూ వీళ్ళూనూ (అంటూ రిక్షావాడికి చిల్లరడబ్బులు యిస్తుంది)

రిజా : ఆ! మీరిచ్చే ఎదవ బేడకాసులకి కట్ట బీడీలు రావు. కాని కింగ్‌కాంగ్ లాంటి బలసిన వాళ్ళు కావాలట, రిజా లాగడానికి చాల్ చాలేమ్మా! భలేచెప్పావ్‌కానీ! స్టేషను ఆరఫర్లాంగున్నట్లే "రా! రా" అని అరిచేది ఇంటికొచ్చాక "పోపో" అన్నట్లు కరిచేది. మీరున్నూ మీ బుద్దిన్నూ ఛా ఛా (అను కొంటూ వెళ్ళిపోతాడు.)

వెం : ఏమిటంటున్నాడు రిజావెధవ.

శా : మనసంగతి కాదులే బాబాయ్! అలసిపోయుంటారు, అందులోను ఎండకొచ్చారు స్నానంచేద్దురు గాని లెండి.

వెం : వేడినీళ్ళేగదూ!

శా : అవును బాబయ్యా!

(వెంకట్రావు కుర్చీలోంచి లేవబోతాడు; కాని ఏదో స్ఫురణకు వచ్చినవాడులాగా. మళ్ళీ కుర్చీలో కూర్చుంటాడు)

వెం: అమ్మాయి శారదా నిన్నొకటి అడగాలనివుంది. ఏమనుకోవు కదూ!

శా : అనుకోనులెండి.

వెం : రామారావు నిన్ను సరిగా చూడడంలేదని, కష్టపెట్టి, కరుగ్గా ప్రవర్తిస్తున్నాడని నాచెవిదాకా వచ్చింది. నిజమేనా!

(శారద ఆశ్చర్యపడి, మళ్ళీ యిది మామూలేగదా భావిస్తుంది. కళ్ళనీళ్లు తుడుచుకొన్నట్లు నటిస్తుంది.)

ఆ! తెలిసింది! అబ్బాయి నిర్వాకం; వాడు రానీ వాని భరతం పడ్తాను: ఈ కాలపు కుఱ్ఱకారంతా యింతే నమ్మాయ్! కాకపోతే సతీసావిత్రి, లాంటి నిన్ను బాధ పెడ్తాడు; నీగుణం, ఓర్పు ఎవరికుంది? అటువంటి నీవు వానికి దొరకడంఎంత అదృష్టం.

శా : ఆ!ఏం అదృష్టంలో! బాబయ్యా! నాల్గు జీతపు రాళ్ళు రావడం: రావడంతోనే హారతికర్పూరంలా కరిగి పోవడం మామూలే! కాని మీలాంటి పెద్దల అండవుండగా మాకేం భయం.

వెం : అంటే క్లబ్బుకేమైనా వెళ్తున్నాడా!

శా : ఏమో బాబయ్యా ఆఫీసునుండి యింటికొచ్చేందుకు ఎందుకింత ఆలస్యం అంటే చేతిలోని ఫైళ్లు చూపిస్తారు.

వెం : (నశ్యం పీలుస్తూ) ఇప్పుడర్థమయింది; వాని సంగతంతా.... సరేలే స్నానం ముగించి వస్తాను... చూడు! ఏదైనా టిఫినుంటే....

శా : లేకేం! రెడిగావుంది. బాబాయ్! స్నానం చేసి రండి....

(వెంకట్రావ్ లోనికి వెళ్తాడు...)

అబ్బా! గ్రహం పట్టిందప్పుడే! ... (అంటూ కుర్చీలో కూర్చొంటుంది....)

రామారావు హుషారుగా ప్రవేశిస్తాడు; చేతిలో ఫైల్ మెల్లగా టేబుల్ మీదపెట్టి, నెమ్మదిగా అడుగు తీసుకొంటూ వచ్చి శారద కళ్ళు మూస్తాడు.)

శా : (వులిక్కిపడి) అబ్బా! విడవండీ!

రా : ఉహు! ఉహు!!

శా : విడవండి. పట్టపగలేమిటండీ! సరసాలు. ....

రా : నీకోసం ఏంతెచ్చానో చెప్పుకో!

శా : నాకేం తెల్సు....

రా : తెలియదు తెలియదూ! (అంటూ రామారావు శారద చేతుల్ని పట్టుకొని ముందరికి త్రిప్పుకోబోతాడు...)

(వెంకట్రావు వెంకట రమణా గోవిందా! గోవిందా!! అంటూ ప్రవేశిస్తాడు. శారద రామారావు చేతుల్ని వెనక్కి తీసుకొంటారు. వెంకట్రావును చూసి.... శారద నవ్వుతుంది.)

రా : "నమస్కారం మావయ్యా! (నమస్కారం చేస్తాడు.)

శీఘ్రమేసంతాన ప్రాప్తిరస్తు" అంటూ దీవించి.

వెం : కులాసా బాబూ!

రా : కులాసే మామయ్యా! ఇదంతా మీచలవే మావయ్యా! ఇంతకూ ఆరోగ్యాంగా వున్నారు కదూ!....

వెం : ఏం ఆరోగ్యంలే బాబూ! కళ్ళుసరిగా కన్పడవు; చెవులు విన్పడవు; తింటే అరగదు; కంటికి నిద్దర రాదు; పళ్ళంతా నొప్పులు,....

రా : చాలు! మామయ్యా! చాలు!! ముసలివారికి శరీరం యిలాగే వుంటుంది.

వెం : నేను ముసలాడినేమిటోయ్! మొన్న నేగా షష్ఠిపూర్తి జరిగింది.

రా : అవును మామయ్యా! మరిచాను. మొన్న నేగా పళ్లన్నీ వూడింది. మొన్న నేగా నల్లవెంట్రుకలు, తెల్లవెంట్రుకలయ్యింది, మీకేం బాబయ్యా! పుట్టే వానికి పెద్దవాడివి; పెరిగే వారికి పిల్లవాడివి. ఇంతకీ—

వెం : ఇక్కడే వుండి పోదామని వచ్చాను. (అంటూ కుర్చీలో కూర్చొంటాడు శారద, రామారావు నోళ్ళు తెరుచుకొని ఆశ్చర్యపడ్డారు.)

ఏమిట్రా! అలా తెల్లపోయి చూస్తున్నారు?.

(రామారావు, శారద తమాయించుకొని.)

రా : ఇద్దరూ ఒకేసారి ఏం లేదు! మామయ్యా!

వెం : (నశ్యం వేసుకొంటూ) ఉద్యోగం ఎలావుందిరా?

రా : మా గుమస్తాల బ్రతుకంతా ఒక్కమాటలో చెప్పాలంటే అరకప్పుడు కాఫీ త్రాగాలి. శారదా? కాఫీ పట్రా! మామయ్యకు కొంచెం పాలు వెక్కువ వేసుకొనిరా! అలాగే పంచదారకూడా. (శారద లోనికెళ్ళుతుంది.)

వెం : (ఆవైపు, ఈవైపు పరీక్షగా చూచి,) ఒరే! శారదా! నిన్ను బాగా చూస్తుందట్రా!

రా : చూడదని అనుమానం మీకు ఏమైనా కల్గిందా!

వెం : అలా కాదురా! ఈనాటి ఆడవాళు, మొగ వాళ్ళను లెక్క చేస్తున్నారట్రా!

రా : లెక్కచేసినా! లెక్కచేయకున్నా!! కట్టుకొన్న పెళ్ళమాయే....

వెం : నీకేంలేరా! నీవు శ్రీరామచంద్రుడివి. నీకు సీతలాంటి భార్య దొరక్క ఏ తాటకో! శూర్పణకో! దొరుకుతుందాట్రా! అంతకూ అమ్మాయి! చేసుకొన్న పుణ్యం. ఏమంటావ్,

రా : నీ మాటకు ఎదురేమంటాను మామయ్యా!...
(శారద కాఫీగ్లాసులతో ప్రవేశిస్తుంది)

శా : ఏమిటండోయ్! మామ అల్లుళ్ళు మంతనాలాడుతున్నారు?

వె : (కాఫీత్రాగుతూ) మాటలకేముందిలే అమ్మాయ్ మీ పిన్నివుండేది చూచావ్! చచ్చి ఎక్కడుందో పాపం. ఎంత సరదాగా వుండేది;

రా : పోన్లెండి మావగారూ! కడుపులో త్రిప్పినట్లవుతోంది.

వెం : వైచ్యంగాని చేసిందేమిట్రా?

రా : అవును (తమాయించుకొని;) కాదు మావయ్యా! అత్తగారి సంగతి అనుకొంటే, ఎంత మంచిది. చిన్నప్పుడు నా జేబులో ఎన్ని పోసేది?

శా : ఏటివండీ?

రా : మరమరాలు, ముంత పప్పును. అలాంటి అత్తయ్యను విడచి మీరింకా యిక్కడే వున్నారంటే.

(శారద మెల్లగా చేత్తో సైగ చేస్తుంది. రామారావు నోరు మూసుకొంటాడు. వెంకట్రావు తల వంచి ఆలోచిస్తుంటాడు.)

రా : మామయ్యా!

వెం : ఏమయ్యా!

రా : ఏం లేదు మామయ్యా! మాదో కోరిక మామయ్యా! మీరు మీ జీవిత కాలమంతా మా కళ్ళేముందు వుండాలని. మాకు పెద్దలదిక్కు లేదు; ఏమంటావ్! శారదా!

శా : అవును బాబయ్యా! వయసు మళ్ళినవారు. (స్టేజి ముందుకు వచ్చి) నెమ్మదిగా యింతో అంతో ఆస్థి వున్నవారు. (వెనక్కి వెళ్ళి) అదీ కాక మా వారు మీలాటి పెద్దల సేవచేసి తరించాలనుకొన్నారు? మాకు పుణ్యాం వస్తుంది.

శా : మీ మీద ఈగ వాలనీయం.

రా : దోమకూడా వాలనీయం.

శా : మీకేది కావాలో చెప్తే.

రా : చిటికెలో మీముందు పెడ్తాం.

శా : ఎల్ల వేళలా.

రా : మీ సేవ

శా : ఇద్దరూ ఏకకంఠంతో! ఏమంటావ్ బాబాయ్యా!

రా : ఏమంటావ్ మామయ్యా!!

వెం : (లోలోన నవ్వుకొంటాడు. తలెత్తి ఏమంటాను. సరేనంటాను.

(శారద రామారావు ఒకేసారి వంగి నమస్కారం చేస్తారు.)

"శీఘ్రమేవ సంతాన ప్రాప్తిరస్తు" (అంటూ దీవిస్తుంటే తెర పడుతోంది.)

## మూడవ రంగం.

(సమయం ఉదయం;) ఆరుగంటలు. రామారావు రంగంలోకి ప్రవేశిస్తూ.....

రా: హరే! రామ! రామరామ హరే! హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే!

(శారద ప్రవేశిస్తుంది.)

శా: ఏమిటండీ! నిద్రనుంచి లేస్తూనే ఎన్నడూలేని హరిభజన చేస్తున్నారు....?

రా: అవునుమరి.... నాటకం మొదలయిందిగా!

శా: నాటకంలో మీ పాత్ర రసపట్టుకెక్కుతోందే!

రా: అంతా మామయ్యగారి దయకోసం....

శా: భలే వారండీ! మీ వేషం చూస్తూంటే నవ్వొస్తూంది...

రా: ఏమిటి నా వేషానికి నవ్వొస్తూందా!

శా: అవును మరి.... నొసటమీద విబూది రేఖలు, రేఖలమీద రూపాయంత బొట్టు. చెవిలో పూలు, అచ్చం పూజారిలాగా వున్నారండీ!...

రా: నవ్వే నవ్వు!... సరే! అంతా నీవు చేసిన పనేగా! నీవుచెప్పిన ఐడియాతో, ఈ మామయ్యతో వేగలేకపోతున్నాం.... ఎంతఖర్చు... ఎంత ఖర్చు... నశ్యానికి, ఆరు ముప్పావలా! అరటి పళ్ళకు ఎనిమిది రూపాయలు;.... జీతంలో పావు భాగం, మావయ్య వచ్చిన పదిహేను రోజుల్లో ఖర్చయిపోయింది. నీకేం తెలుసు నా బాధ,.... సర్లేగాని మావయ్య నిద్రనుంచి లేచాడా!

శా: ఎపుడో లేచాడండీ! స్నానం చేస్తున్నాడు.

రా: స్నానానకని, నీళ్ళు తెచ్చేందుకే ఓ మనిషి పెట్టుకోవల్సి వస్తూందేమో!

శా: భలేవారే లేండి: వంట చేసేందుకు వంట మనిషి కుదర్చలేక పోయారుగాని...

రా: అవును, మీ బాబు ప్రతినెల పంపుతున్నాడుగా డబ్బు.... మావయ్యకు వంగి వంగి నమస్కారములు పెట్టడంతో నడుము పట్టుకుంది.

శా: మీకు నడుము పట్టుకొంటే నాకు కాళ్ళు పట్టుకొన్నాయి. అక్కడికి ఇక్కడికి తిరిగే సరికి నా పని అయిపోతోంది...

రా: మావగారికి పూజాపునస్కారాలకు కావలసిన సామాగ్రులను తీసి పెట్టు.... ఏమిటో మరి ఆఫీసులో కూర్చొన్నా ఈ మావయ్యమీద ధ్యాస తప్పా యింకేం లేదు...

శా: ఇంతకూ మీ పూజయిందా!

రా: పూజేమిటి పూజ ఒక్క నిముసంలో ముగించేశా!.... కొబ్బరికాయలు కొట్టడం, హారతి వెలిగించడంతో నా పూజ సమాప్తం. మన నాటకంలో ఒక అంక కూడ పూర్తి అయినట్లే...

శా: మెల్లగా చెప్పండి; బాబాయిగారు వినేరు.

రా: చెవులు వినపడవుగా....

శా: అవసరమయితే వాటంత కవే విన్పడుతాయి.

రా: పోనీలే శారదా! మన నాటకం పూర్తిగా ఫలిస్తుందా!....

శా: అంతా భగవంతుని దయ. కాదుకాదు బాబాయ్యగారి దయ.

రా: ఏం దయో ఏమో! మన నాటకం ఫలిస్తే వెరీగుడ్- లేకపోయిందా... మన ప్లాన్, డబ్బు, టైమ్ అంతా వేస్ట్, డబుల్ వేస్ట్,

శా: అలా కాదు లేండి. దారికి వస్తున్నాడు. అప్పటికి యిప్పటికి చాలతేడా వుంది.

రా: తేడా బుద్ధిలోనా!

శా: అబ్బే! కాదండి. శరీరంలో మార్పండి, పిల్లిలాగా వచ్చాడు; ఏనుగులా తయారవుతున్నాడు.

రా: ఏమయితేనేం. మన నాటకం నిజంగా నాటకం అయిపోయిందేమోనని భయంగా వుంది.

శా: అలా జరగదు. ఇక బాబాయి వస్తాడు. నేవెళ్తా మరి.

రా: వెళ్ళు. వెళ్ళు. నీ ఐడియా నా ప్రాణం తీస్తోంది.

(నవ్వుకొంటూ శారద వెళ్ళి పోతుంది.)

(ఇంకావుంది)

# కీ. శే. శ్రీ వినాయక విద్యాలంకార్



శ్రీ వినాయక విద్యాలంకార్

ఆంధ్రమహిళాసభ ట్రస్టీలలో ఒకరైన శ్రీ వినాయక రావు కొరాటకర్ విద్యాలంకార్ సెప్టెంబరు మూడవ తేదీన మరణించారని తెలుపుటకు చాలా విచారిస్తు న్నాము. శ్రీ వినాయకరావుగారు అనేక విద్యాసంస్థలకూ, సాంఘిక సంస్థలకూ సేవ చేయడమేకాకుండా ఇటీవలనే హైద్రాబాద్‌లోని మా ఆంధ్ర మహిళా సభ ట్రస్టీలలో ఒకరిగా నూతన కార్య భారం తమపై వేసుకున్నారు.

వీరు మహారాష్ట్రలోని వుస్మానాబాద్ జిల్లాలోని కలమ్ గ్రామంలో 1895 ఫిబ్రవరి మూడవ తేదీన జన్మించారు. బాల్యంనుంచి విద్యార్జనలో బహుముఖమైన ప్రజ్ఞచూపారు. తొమ్మిదవ ఏటనే ఉత్తర ప్రదేశ్‌లోని హరిద్వార్‌లో వున్న కంగడి గురుకులంలో విద్యాభ్యాసానికై ప్రవేశించారు. ఆ గురుకులవాసం వీరి భావిజీవితానికి ఒక ప్రత్యేకతని చేకూర్చినది. హిందూ ముస్లిమ్ ఐక్యతకి, ముఖ్యంగా హైద్రాబాద్ నగర అభివృద్ధికి అనవరతం పాటు బడుతూండేవారు వీరు. అన్యాయాలనీ, అక్రమాలనీ వీరోచిత దృష్టిలో ఎదుర్కొనుటలో వీరికి వీరేసాటి. నలభై వేలమంది గూండాలు వీరి గృహాన్ని చుట్టిముట్టినపుడు కూడా ఏ మాత్రమూ జంకకుండా, నిలిచి ఎదుర్కొన్నారు. హైద్రాబాద్ స్వాతంత్ర్య సమరంలో వీరి పాత్ర చిరస్మరణీయమైనది. లియాక్

శ్రీ వినాయకరావుగారికి ఆధునిక హైద్రాబాద్ నగర నిర్మాతలలో ఒకరు. హైద్రాబాద్‌లో వీరి ప్రమేయంలేని విద్యాసంస్థలు కానరావు. ప్రతి విద్యాసంస్థకీ చిన్నాపెద్దా తారతమ్యంలేకుండా, యితోధిక సేవ చేశారు. హైద్రాబాద్‌లో కేశవ మెమోరియల్ హైస్కూల్ శ్రీ విద్యాలంకార్ తండ్రిగారైన కేశవ విద్యాలంకార్ పేరున వీరు స్థాపించినదే. హైద్రాబాద్‌లోని హిందీ ఆర్ట్స్ కాలేజీకి ఈయన వ్యవస్థాపకులు. దక్షిణాన హిందీ బోధనాభాషగా గలకాలేజీ ఇదిఒక్కటే. హైద్రాబాద్ దక్షిణహిందీ ప్రచారసభ వ్యవస్థాపకులలో ఒకరటమేకాక, ఆ సభ కార్యదర్శులుగాకూడా అనన్యమైన సేవ చేశారు.

శ్రీ విద్యాలంకార్ గొప్ప విద్యావేత్తయేకాక రాజకీయవాది కూడాను. శ్రీ బూర్గులరామకృష్ణారావు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు, శ్రీ విద్యాలంకార్ ఆర్థిక పరిశ్రమల మంత్రిగా వుండేవారు. వెల్లోడి గవర్నమెంటులో మంత్రిగానూ, ఆ తరువాత లోక్‌సభ మెంబరుగాను హైద్రాబాద్‌ప్రజలకి ప్రగతికి ఇతోధిక సేవ చేశారు. హైద్రాబాద్‌లోని ఆర్యసమాజ్ అభివృద్ధికొరకు ఈయన చాలా పాటు పడ్డారు.

శ్రీ వినాయకరావు విద్యాసామాజిక రాజకీయ విషయాలలోనే గాక గ్రంధకర్తగా కూడా హైద్రాబాద్ ప్రజలకి చిరపరిచితులు. వీరు ఎక్కువగా మహాపురుషుల జీవిత సంగ్రహ చరిత్రలు పరిచయంచేశారు. మహాత్మాగాంధి, సర్దార్ వల్లభాయ్ పటేల్, అబ్రాహిమ్ లింకన్ వంటి మహనీయుల జీవిత చరిత్రలూ, 'చాబిక్' అను కథాసంపుటి వీరు రచించారు. శ్రీ విద్యాలంకార్ పరమపదించడంతో వీరు ఈశోపనిషత్‌మీది వ్యాఖ్యానం అసంపూర్తిగానే వుండిపోయింది.

శ్రీ విద్యాలంకార్ స్మృతి చిహ్నంగా సెప్టెంబరు 3 న హైద్రాబాద్‌లోని అనేక షాపులూ, విద్యాసంస్థలూ మూయబడినాయి. వీరికి యిద్దరు కొడుకులు, ఒక కూతురూను.

అనేక విద్యాసంస్థలకీ, ఆర్యసమాజ్ అభివృద్ధికీ, హిందీ భాషాభివృద్ధికీ, ముఖ్యంగా మా ఆంధ్రమహిళా సభాభివృద్ధికీ సేవ చేసిన శ్రీ విద్యాలంకార్ ఆత్మశాంతికి ప్రార్థిస్తూ, వారి కుటుంబానికి మా సానుభూతిని తెలుపుకుంటున్నాము.

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the Month of August 1962

**OUT-PATIENT DEPARTMENT:—**

| | | |
|---|---|---|
| No. of Surgical cases treated | | 42 |
| " " Medical " " | | 697 |
| " " Ante-natal " " | | 248 |
| " " Post-natal " " | | 85 |
| " " Gyneac " " | | 90 |
| " " E.E.N.T. " " | | 37 |
| " " Dental " " | | 7 |
| Total " " New Patients treated | | [illegible],206 |
| " " " Old " " | | 1,810 |
| | Grand Total | 3,016 |

**ADMISSION REGISTER:—**

| | | | |
|---|---|---|---|
| No. Patients admitted for Normal Delivery | | | 158 |
| " " " " " Abnormal Delivery | | | |
| | Forcepts | 3 | |
| | Ext. Breech | 2 | 5 |
| " " Ante-natal casese False pains Treated | | | 28 |
| " " Ante-natal cases Treated Toxeamia " | | | 5 |
| " " Medical " " | | | 18 |
| " " Post-Natal " " | | | 1 |
| " " Gyneac Cases Treated | | | 21 |
| " " Surgical Cases Treated | | | 2 |
| " " Babies admitted as Lodgers | | | 162 |
| | Grand Total | | 400 |

(True Copy)

| | | |
|---|---|---|
| Sd. Dr. K. R. AMBUJA | (Sd.) Dr. M. PAVANA BAI | (Sd.) B TIMMABAI |
| *Resident Medical Officer* | *Medical Superintendent* | *Joint Secretary* |

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీవిశ్వవిద్యాలయపుఅడ్మిషన్, ఆంధ్రామెట్రిక్, ఇ. ఎస్. ఎల్.సి., పరీక్షలకు శిక్షణ. |
| పారిశ్రామిక విద్యాలయము | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము. |
| మహిళా మందిరము | : విద్యార్థినులకు వసతి గృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాల—అడయారులో నిర్మించబడినవి. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త, నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. ఫామిలీ ప్లానింగు వర్కర్సుకు శిక్షణ కూడ యివ్వబడుచున్నది. |
| ఆర్థోపీడిక్ సెంటర్ | : వికలాంగులగు బాలబాలికలకు సంరక్షణ, విద్య యిచ్చే సంక్షేమ కేంద్రం. |
| ముద్రణాలయము | : విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూఫురీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. ప్రింటింగు జాబ్ వర్కు చేయబడును. |
| నాగేశ్వర శిశువిహార్ | : పిల్లల విద్యావినోద కేంద్రం ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది. |
| వనితా బాలవిహార్ | : స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం |

## ఆంధ్ర మహిళా సభ, హైదరాబాదు

హైదరాబాదు శాఖ నిర్వహిస్తున్న కార్యక్రమాలు: (1) రీజనల్ హేండిక్రాఫ్ట్సు, (2) సంక్షిప్త విద్యాప్రణాళిక, (3) చేనేత శిక్షణ- ఉత్పత్తికేంద్రము, (4) పౌర సంక్షేమ కార్యక్రమ పథకము. (5) వసతిగృహము.

Printed and Published by N. R. Chandur, at Andhra Mahila Press, 7-A, Rosary Church Road,